Photo by S. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

కాయకష్టము....

పంపినవారు :
బి. మల్లణ్ణ - నందవరం

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక తమాషాలు, ఫొటోశీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

# పిల్లలారా వినండి

## వందలకొలదీ **బహుమతులు** గెలువబడాలి!



వయస్సు గ్రూప్ I: 4–9 ఏళ్ల

మొదటి బహుమతి:
మార్క్లిన్ ఎలెక్ట్రిక్ రైలు సెట్
లేక రాడ్డీ వాకీ-టాకీ బొమ్మ

రెండవ బహుమతి:
మెజెస్టిక్ బేబీ కారు

మూడవ బహుమతి:
బేకో బంపర్ బిల్డింగ్ సెట్ లేక
బొమ్మరిల్లు సామగ్రి సహా

వయస్సు గ్రూప్ II: 10-14 ఏళ్ల

మొదటి బహుమతి:
జీస్ ఇకన్ కెమేరా (లెన్సు ఎఫ్:4-5)
కేసు సహా

రెండవ బహుమతి:
మెక్కానో సెట్ (నం. 6) లేక
ఎచ్.ఎమ్.వి. పోర్టబిల్ గ్రామఫోన్

మూడవ బహుమతి:
ఫ్యూ మాస్టర్ మరియు స్లయిడ్లు లేక
పెద్ద అల్లిక–పని సెట్

వయస్సు గ్రూప్ III: 15-18 ఏళ్ల

మొదటి బహుమతి:
17 జ్యూయెల్డ్ రిస్ట్ వాచీ లేక
ఉషా కుట్టు మిషను

రెండవ బహుమతి:
పార్కర్ 51 పెన్ & పెన్సిల్ సెట్

మూడవ బహుమతి:
స్టాంపు ఆల్బమ్ 1000 స్టాంపులుసహా
లేక సొగసైన చర్మపు వ్రాత కేసు

దక్షిణ భారతమందలి ప్రతీ బిడ్డకున్నూ ఇదొక ఉత్సాహకరమైన రంగులువేసే కొత్త పోటీ, ఇది సులభం, ఇది ఉత్సాహకరం, మరియు వందలకొలదీ బహుమతులు గెలువబడాలి. మీ సమీప మెక్లీన్స్ వ్యాపారి వద్దకువెళ్లి ఒక ఎంట్రీ ఫారమ్ అడిగి తీసుకోండి.

ఎంట్రీలు సుప్రసిద్ధ, చిత్రకళా నిపుణులైన, ఢిల్లీయందలి శంకర్స్ వీక్లీ సంపాదకులు, శ్రీ శంకర్‌గారిచేత పరిశీలించి నిర్ణయింపబడును

మరియు రెండువందలుకంటె ఎక్కువగా ప్రోత్సాహక **బహుమతులు గలవు**

**తల్లి దండ్రులకు బహుమతులు**

మీ బిడ్డ మొదటి బహుమతిని గెలుపొందినయడల, దానితో పాటు మీకు ఒక ఘనమైనటువంటి 6-వాల్వుల ఫిలిప్స్ రేడియో సెట్ ఇవ్వబడును.




# మెక్లీన్స్ రంగులువేసే పోటీ

### పిల్లలకోసం –

# ఇంకొక సులభమైన గిబ్స్ డెంటిఫ్రిస్ రంగులు వేసే పోటీ

## ఆకర్షణీయమైన బహుమతులు



**మొదటి బహుమతి:**
రేలీ సైకిల్...



**రెండవ బహుమతి:**
హెచ్ ఎమ్ వి గ్రామఫోన్



**మూడవ బహుమతి:**
వ్యూ మాస్టర్ ప్రొజెక్టర్ సెట్

మరియు **100** ఆకర్షణీయమైన ప్రోత్సాహక బహుమతులు:

**ఈ బొమ్మకు రంగులు వేయండి:** ఇది ఎంతో సులభము, ఎంతో ఉత్సాహకరము: మరియు మీరు ఒక ఆకర్షణీయమైన బహుమతిని గెలుపొందవచ్చునుకూడ – మీరు పొందవలెనని ఎల్లప్పుడూ ఎంతో ఎక్కువ కోరికతోనున్న ఏదో ఒక వస్తువును. మీరు వాటర్ కలర్లు, రంగు పెన్సిలు లేక చాక్ లేదా మీకు లభించే మరియే ఇతర రంగులనైనా ఉపయోగించవచ్చును. మీరు దానిని చేతనైనంత సుందరముగా జేయండి. గిబ్స్ డెంటిఫ్రిస్ బిళ్ల యొక్క పైసెల్లోఫేన్ రేపర్ మీద నున్న ఒక గిబ్స్ ముద్రను చేర్చి – ఆ బొమ్మను మాకు పంపండి. మీకొక గిబ్స్ డెంటిఫ్రిస్ డబ్బీని నేడే కొనిపెట్టమని మీ అమ్మను అడగండి. దానిని ప్రతీరోజూ వాడండి: ముగ్గురు తీర్పరుల సంఘము అర్హతానుసారం ఏ బొమ్మలు శ్రేష్ఠమైనవో నిర్ణయింతురు. నేడే పాల్గొనండి!

**ఈ నిబంధనలను జ్ఞాపకముంచుకోండి:** **1.** 14 ఏళ్ల వయస్సు మించనట్టిన్ని భారత దేశ నివాసులైయున్నట్టిన్ని ప్రతీ బాలుడుగాని, బాలికగాని ఈ పోటీలో పాల్గొనవచ్చును. **2.** మీ కిష్టమైనన్ని బొమ్మలను మీరు పంపవచ్చును: అయితే ప్రతీబొమ్మయున్నూ 'గిబ్స్ డెంటిఫ్రిస్ బిళ్లయొక్క పైసెల్లోఫేన్ రేపర్ మీద నున్న ఒక గిబ్స్ ముద్రను చేర్చి పంపబడవలెను. **3.** మీ బొమ్మలను గిబ్స్ డెంటిఫ్రిస్ కాంటెస్ట్, పోస్టుబాక్స్ నం. 10119 బొంబాయి–1' ఈ చిరునామాకు 1958 ఆగస్టు 30 వ తేదీ శనివారము మధ్యాహ్నం 1 గంటలోవుగా చేరునట్లు పంపండి. **4.** బొమ్మలు కంపెనీకి చేరకుండా మధ్యలో పోయినను, ఆలసింపబడినను, తప్పు స్థలమునకు పంపబడినను, లేదా చెడిపోయినను, అట్టి బొమ్మలకు కంపెనీవారు బాధ్యులుగారు. **5.** మొదటి, రెండవ, మూడవ, బహుమతులను .గెలుపొందినవారి పేర్లు నవంబరులో ఈ పత్రికయందు ప్రకటించబడును. ఇతర బహుమతులను

GD. 40A-50 TL

ధైర్యశాలి రాము — డంబాల రంగా














DL. 337A-50 TL















అలాబొంకకు! ... సరే, ఏదిఎలాగైనా, ఒక్కటి మాత్రం తథ్యం, నీవు నాలాగ ప్రతీరోజూ ఎక్కువగా పాలు త్రాగుతూ, డాల్డాతో వండబడిన ఆహారమును భుజించుతూ వుండకపోతే, బలంగానూ, ధైర్యంగాను, వుండలేవు.

అవును, డాల్డాతో వండబడిన ఆహారము ఆరోగ్యవంతమైనది, పుష్టికరమైనది. దానిలో ఆరోగ్యమును గలిగించునట్టి 'ఎ', 'డి', విటమినులు చేర్చబడియున్నవి; అవి పిల్లల పండ్లను, ఎముకలను దృఢపరుస్తాయి, ఎల్లప్పుడూ డబ్బామీద ఖర్జూరపు చెట్టు వున్నటువంటి డాల్డాను కొనండి.



హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ బొంబాయి.

DL. 337B-50 TL

నేడే చూడండి!









జలరుహ్ వారి

# రాజనందిని

మాటలు,పాటలు.. మల్లాది రామకృష్ణ శాస్త్రి * సంగీతం... టి.వి.రాజు

దర్శకత్వము.....వేదాంతం రాఘవయ్య

RAMDAS.K

FLOODLIGHT




జోగాడు పాపాయి తొట్ట తొలిసారిగా అడుగిడుట చూచి తల్లిదండ్రుల హృదయం ఆనందంతో పొంగిపోతుంది.

పాపాయికైతే ఆ తొలి అడుగు తన జీవితంలో అద్భుతానుభవంగా ఉంటుంది. అతడు అంతకంటె శీఘ్రంగాను, ఆరోగ్యవంతంగాను పెరుగుటకొరకు తోడ్పడు ఆల్విటోన్ ఇవ్వండి. అది అన్ని విటమినులు గల ఆహారం. అది భారతదేశంలోనే తయారైన పౌష్టికమూ, రుచ్యమూ అయిన పానీయం.

పాపాయికి పాలిచ్చు ప్రతీ సారీ 2 చంచాల ఆల్విటోన్ చేర్చి ఇవ్వండి. అతనికి ఆహారంపై మరిన్ని ఆశ కలుగుతుంది. ఆల్విటోన్ వయస్కులకున్నూ ఎంతో మంచిది.




**ఆల్విటోన్** కావాలని అడగండి.

అది భారతదేశపు ప్రియకర ఆహార పానీయం.

తయారుచేయువారు :

ఆల్విటోన్ లాబొరేటరీస్, మద్రాసు-16

CHARI



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

భారతీయ స్వాతంత్ర్య చరిత్రలో మరొక కొత్త సంవత్సరం ఈ నెలలో అరంభమవుతున్నది. స్వాతంత్ర్యం వెంట మనం పురోగమనాన్ని సాధిస్తున్నాం. కొత్త ప్రాజెక్టులూ, కొత్త పరిశ్రమలూ ఏర్పాటవుతున్నాయి. అంతర్జాతీయ రంగంలోకూడా భారతదేశపు ఖ్యాతి నానాటికీ పెరుగుతున్నది. మాజీ వలసప్రాంతాలలో ప్రజలు సాగించే స్వాతంత్ర్య పోరాటాలపట్ల మన దేశం సానుభూతి చూపుతూవుండటం గొప్పవిషయం.

"పగ" మానవుడి దృష్టిని వెనకకు మళ్లించి, అతని అభివృద్ధికి ఆటంకం కలిగిస్తుంది. అది ప్రతీకార బుద్ధిని రేకెత్తిస్తుందికూడా. అందుచేత పురోగమించదలచిన మనిషి పగనూ, ప్రతీకారాన్నీ విసర్జించాలి. ఈ నీతి "పగ : ప్రతీకారం" [బేతాళ కథ] లో స్పష్టమవుతున్నది.

జీవితంలో పురోగమనం సాధించాలంటే భావాలలోకూడా పురోగమనం అవసరం. "అనుకోని అదృష్టం" అన్న కథలో వీరయ్య గొప్పగా బతకగలిగి ఉండికూడా సంస్కార హీనతవల్ల హీనంగా బతుకుతాడు. అయన అడ్డు తొలగగానే రాముడనే నౌకరు వారి కుటుంబానికి ఐశ్వర్యం సంపాదించి పెడతాడు.

సంపుటి 23 ★ ఆగస్టు 1958 ★ సంచిక 2



# అట్టవిూదిబొమ్మ

కౌరవ పాండవుల మధ్య జరగబోయే యుద్ధంలో పోరాడటానికి రాజులందరూ తమ సైన్యాలతో వచ్చి చేరారు. కౌరవుల పక్షాన పదకొండు అక్షౌహిణీల సేనా, పాండవుల పక్షాన ఏడు అక్షౌహిణీల సేనా చేరింది.

ఈలోపుగా సంధిరాయబారంమీద పాండవులు పంపిన ద్రుపదపురోహితుడు ధృతరాష్ట్రుడి సభకు వచ్చి, పాండవుల కివ్వవలసిన రాజ్యభాగం వెంటనే ఇచ్చి సఖ్యంచేసుకోమనీ, యుద్ధానికి దిగితే కౌరవులకు నష్టం కలుగుతుందనీ చెప్పాడు.

"ఈ విషయం నేను ఆలోచించి సంజయుడిద్వారా పాండవులకు సమాధానం పంపుతాను!" అని చెప్పి ధృతరాష్ట్రుడు ద్రుపదపురోహితుణ్ణి పంపేశాడు. తరవాత సంజయుడు పాండవులవద్దకు వచ్చి ధర్మరాజుతో యుద్ధప్రయత్నం మానుకోమన్నాడు.

"దుర్యోధనుడు మా రాజ్యాన్ని మాకు మంచిగా ఇచ్చేస్తే యుద్ధం చెయ్యము. కాని అతడు లోభి అయి అందుకు నిరాకరిస్తే తప్పక యుద్ధంలో ఓడించి మాకు రావలసినది తీసుకుంటాము," అన్నాడు ధర్మరాజు. కృష్ణుడు కూడా ధర్మరాజును బలపరిచాడు. ఆఖరు మాటగా ధర్మరాజు అయిదుఊళ్ళు కోరాడు. వాటిలో నాలుగు కుశస్థలం, వృకస్థలం, మాకంది, వారణావతం. అయిదవది దుర్యోధనుడికే వదిలాడు.

సంజయుడు హస్తినాపురానికి తిరిగి పోయి ధృతరాష్ట్రుడితో జరిగిన సంగతి చెప్పాడు. ఆ రాత్రి ధృతరాష్ట్రుడికి నిద్ర రాలేదు. విదురుణ్ణి పిలిపించాడు. విదురుడు ఆయనకు అనేక నీతులు బోధించాడు.

మర్నాడు సభలో సంజయుడు పాండవులు పంపిన సందేశాన్ని దుర్యోధనాదులకు తెలిపాడు. భీష్మద్రోణులు యుద్ధంవల్ల కీడు కలుగుతుందనీ, అర్జునుణ్ణి ఎవరూ గెలవలేరనీ అన్నారు. తానొక్కడే పాండవబలాలను నాశనం చెయ్యగలనని కర్ణుడు ప్రగల్భాలాడాడు. భీష్ముడు అతనిని మందలించాడు. కర్ణుడు అలిగి, "నువు బతికిఉండగా నేను ఆయుధం పట్టను," అని భీష్ముడితో ప్రతిజ్ఞచేసి సభనుంచి వెళ్ళిపోయాడు. దుర్యోధనుడిది చూసి అలిగి భీష్ముడితో, "నేను మిమ్మల్నందర్నీ నమ్ముకుని యుద్ధానికి దిగటం లేదు. నేనూ, కర్ణుడూ, దుశ్శాసనుడూ కలిసి పాండవులను చంపగలం," అన్నాడు.




ఒకానొక దేశంలో ఒక రాజుండేవాడు. ఆయనకు ఒక్కతే కూతురు. ఆ పిల్ల చాలా అందగత్తె. అందుచేత అనేకమంది యువకులు వచ్చి, ఆమెను మాకిమ్మంటే మాకిమ్మని రాజును వేధించుకు తినసాగారు.

రాజుగారు తెలివితేటలలో ఉద్దండుడు. ఆయనను ఎవరూ మోసగించలేరు. అందుచేత, తన కుమార్తెకు వరుణ్ణి నిర్ణయించటానికి ఆయన ఒక ఆలోచన చేశాడు. "నన్ను మోసపుచ్చినవారికి నా కుమార్తెనిచ్చి పెళ్ళి చేసి, నా అర్ధరాజ్యంకూడా కట్టబెడతాను!" అని ఆయన తన రాజ్యమంతటా చాటింపు వేయించాడు. రాజుగారిని మోసగించటానికి ప్రయత్నించి ఓడిపోయినవారికి కొరడా దెబ్బలు!

రాజుగారు చాలా గడుసువాడు; ఆయనను మోసగించలేకపోతే కొరడాదెబ్బలు తినాలి. అయినప్పటికీ అందగత్తె అయిన రాజకుమార్తెను పెళ్ళాడాలన్న ఆశతో చాలా మంది యువకులు వచ్చి, రాజుగారిని మోసగించలేక కొరడాదెబ్బలు తిని వెళ్లిపోయారు.

ఆ నగరంలోనే ఒక ధనికుడున్నాడు. ఆయనకు ముగ్గురు కొడుకులు. వారిలో పెద్దవాళ్లిద్దరూ తెలివిగలవాళ్ళు, మూడోవాడు వట్టి చవటలాగుండేవాడు. వాడు ఎన్నడూ ఏ పనికీ అక్కరకు రాక అస్తమానం గోళ్ళు గిల్లుకుంటూ ఒకమూల కూచునేవాడు. వాణ్ణి అందరూ "బుద్ధుడు" అని పిలిచేవాళ్ళు.

ధనికుడి పెద్దకొడుకు ఒకనాడు తండ్రితో, "నాన్నా, రాజకుమార్తెను పెళ్లాడటానికి అందరూ ప్రయత్నిస్తున్నారు. నేను కూడా ప్రయత్నిస్తాను," అన్నాడు.

"వెళ్లిరా, నాయనా. ఈ ప్రయత్నించే వాళ్లంతా నీకన్న తెలివిగలవాళ్లా ఏమిటి?" అన్నాడు తండ్రి.

ఎమ్. వి. చలపతిరావు



పెద్దవాడు బయలుదేరి రాజుగారి ఇంటికి వెళ్లి, తాను వచ్చిన పని తెలియజేసి, రాజుగారి దర్శనం కోరాడు. భటులు వాణ్ణి రాజుగారుండే గదికి తీసుకుపోయారు. వాడు రాజుగారికి నమస్కారం చేస్తూ కిటికీగుండా బయటికి చూసి, "అ కనిపించే మూడు నల్లబాతులూ ఎంత అందంగా ఉన్నాయో!" అన్నాడు ఆశ్చర్యంగా.

"నీ తెలివితేటలు తగలడ్డట్టే ఉన్నాయి. చూడటానికి ఒక నల్లబాతు చాలదూ? వీణ్ణి తీసుకుపోయి కొరడాదెబ్బలు కొట్టి పంపెయ్యండి!" అన్నాడు రాజు. భటులు వాణ్ణి కొరడాతో కొట్టారు. పెద్దవాడు దెబ్బలు తిని ఇంటికి తిరిగి రాగానే, రెండో వాడికికూడా అదే బుద్ధిపుట్టింది.

వాడుకూడా తండ్రి అనుమతి పొంది రాజుగారి దర్శనానికి వెళ్ళాడు. వాడు వచ్చిన పని తెలియగానే వాణ్ణికూడా రాజుగారి గదిలోకి పంపారు. వాడుకూడా కిటికీలోనుంచి బయటికి చూసి, "అదేమిటి? అ చెట్టుమీద కూచున్న కాకి వీపుపైన మూడు తెల్లటి చారలున్నాయి!" అన్నాడు.

"కాకి వీపున చారలు అబద్ధమూ, నీ వీపున వాతలు నిజమూనూ! వీణ్ణి పట్టుకుపోయి కొరడాతో కొట్టి పంపెయ్యండి," అన్నాడు రాజు.

రెండోవాడుకూడా పరాభవం పొంది తిరిగి వచ్చాక, బుద్ధుడు తండ్రితో తాను వెళ్లి రాజును మోసగించి రాజకుమార్తెను పెళ్ళాడతానన్నాడు.

"గడుసువాళ్ళయిన నీ అన్నలకు చేతగాని పని నీవల్ల అవుతుందా? నువు అసలే బుద్ధవిగ్రహానివి!" అన్నాడు తండ్రి.

కాని బుద్ధుడు పట్టుబట్టాడు.

"సరే, అంత ఉబలాటంగా ఉంటే వెళ్లి కొరడాదెబ్బలు తినిరా!" అన్నాడు తండ్రి.

మూడోవాడు గోడవంకెను వేళ్ళాడే మాసిపోయిన కుళ్ళాయి తీసి దులిపి చేతబట్టు

కుని రాజుగారి ఇంటికి బయలుదేరాడు. దారిలో వాడికి ఒక అమ్మి, నెత్తిన కుండల దొంతరలు పేర్చి పెట్టుకుని కనిపించింది.

"ఏమమ్మీ, ఈ కుండలు ఎక్కడికి తీసుకుపోతున్నావు?" అన్నాడు బుద్ధుడు.

"అమ్మటానికి, నాయనా!" అన్నదామె.

బుద్ధుడు వాటి ఖరీదు అడిగాడు. కుండలమ్మే మనిషి మూడురూపాయలన్నది.

"అయిదురూపాయ లిస్తాను, నేను చెప్పినట్టు చేస్తావా?" అన్నాడు బుద్ధుడు. ఆమె ఒప్పుకున్నది. ఇద్దరూ కలిసి రాజుగారింటి దాకా వెళ్ళారు. ఏం చెయ్యాలో ఆమెకు బుద్ధుడు వివరంగా చెప్పాడు.

ఇద్దరూ రాజుగారింటి బయట ఆగారు. బుద్ధుడు గట్టిగా, "నేను అమ్మను! నాకు కావాలి! ఊరికే నన్ను పీడించకు!" అని అరవసాగాడు.

ఈ కేకలు విని రాజుగారు బయటికి వచ్చి బుద్ధుణ్ణి చూసి, "ఎందుకలా పాలి కేకలు పెడుతున్నావు? అమ్మటానికి నీ దగ్గిర ఏమున్నది?" అని అడిగాడు.

"ఈ కుళ్ళాయి, మహారాజా! ఇది మాయల కుళ్ళాయి. దీన్ని నెత్తిన పెట్టుకుంటే ఎవరినన్నా మోసగించవచ్చు!" అన్నాడు బుద్ధుడు.



"ఏదీ, ఎవరినన్నా మోసగించు!" అన్నాడు రాజు.

బుద్ధుడు కుళ్ళాయి నెత్తిన పెట్టుకుని అటూ ఇటూ చూసి కుండలమ్మే మనిషి దగ్గిరికి వెళ్ళి, "ఏయ్, నీ కుండలన్నీ పగలగొట్టు!" అన్నాడు.

వెంటనే ఆ మనిషి తన నెత్తిన వున్న కుండలు ఒక్కొక్కటే తీసి నేలకేసి కొట్టసాగింది.

రాజు నిర్ఘాంతపోయాడు. అలాటి కుళ్ళాయి ఇతరులదగ్గిర ఉండటం తనకూ తన కుమార్తెకూ అంత క్షేమం కాదనుకుని ఆయన దాన్ని తనకు విక్రయించమన్నాడు.

బుద్ధుడు చచ్చినా ఆ కుళ్ళాయిని అమ్మ నన్నాడు. రాజుగారు సంచీడు మొహరీలు ఇవ్వజూపినాక వాడు బుర్ర గోక్కుని, "సరే ఇవ్వండి! ఎవరికో ఒకరికి దీన్ని ఎప్పటికైనా అమ్మేదే గదా!" అన్నాడు. తర వాత వాడు రాజుకు కుళ్లాయి ఇచ్చి మొహ రీల సంచీ తీసుకుని ఇంటికి వెళ్ళాడు.

వాడు ఆ డబ్బుతో గొప్ప దుస్తులు కొని, వాటిని ధరించి మర్నాడు రాజుగారివద్దకు వెళ్లి, "తమ కుమార్తె నిచ్చి వివాహం చేయిం చండి!" అని అడిగాడు.

రాజు కేమనాలో తోచలేదు. కుళ్ళాయిలో మహిమ ఏమీ లేదనీ, తనను వాడు మోస గించాడనీ అప్పటికి ఆయన గ్రహించి ఉన్నాడు. చివరకాయన, "నువు నన్ను చెప్పి మోసగించలేదు. రేపు ఉదయం మంత్రిని బలాత్కారంగా నాదగ్గిరికి తీసుకు రాగలిగితే నువు నిజంగా తెలివిగలవాడివని నమ్ముతాను!" అన్నాడు.

"చిత్తం," అని బుద్ధుడు వెళ్ళిపోయాడు. మర్నాడు మంత్రి తన ఇంటనే ఉండి, ఇంటి చుట్టూ నౌకర్లను కాపలా పెట్టి, బుద్ధుడు అక్కడికి వచ్చినట్టయితే మెత్తగా తన్నమన్నాడు.

ఈలోపల బుద్ధుడు మారువేషం వేసు కుని ఒక గోతం సంచీలో దూరి మంత్రిగారి



ఇంటి సమీపానికి దొర్లుకుంటూ వచ్చాడు. అది చూసి భటులు ఆశ్చర్యంతో సంచీని సమీపించి, "ఏయ్, సంచీలో ఎవరు నువు ?" అని అడిగారు.

"ష్! మాట్లాడకండి!" అన్నాడు బుద్ధుడు.

భటులు ఈ సంగతి మంత్రితో చెప్పారు. ఆయన హడావిడిగా బయటికి వచ్చి సంచీలో ఉన్న బుద్ధుణ్ణి, "ఎవరురా నువ్వు?" అని గద్దించి అడిగాడు.

"మాట్లాడకండి! ఇది జ్ఞానసంచీ! నాకు అనేక విషయాలు చెబుతున్నది!" అన్నాడు బుద్ధుడు తాపీగా.

"ఏదీ ? అది చెప్పే సంగతుల్లో ఒకటి చెప్పూ!" అన్నాడు మంత్రి.

"నిన్న రాజుగారిని మోసగించిన దుర్మార్గుడు మీ ఇంటిపైకి పదిహేడుమంది యోధులతో వచ్చి పడబోతున్నాట్ట! ఈ సంచీ చెబుతోంది!" అన్నాడు బుద్ధుడు.

"మరి నేనేం చెయ్యాలి?" అన్నాడు మంత్రి కంగారుగా.

"సంచీనే అడగండి!" అన్నాడు బుద్ధుడు.

మంత్రి సంచీ విప్పి బుద్ధుణ్ణి బయటికి రానిచ్చాడు. మంత్రి సంచీలో కూచుని, "నేనేం చెయ్యాలి?" అని సంచీని అడి



గాడు. ఇంతలోనే బుద్ధుడు సంచీ మూతి బిగించి కట్టి, మంత్రిని భుజాన వేసుకుని పోయి రాజుగారి ఎదట పెట్టాడు.

"ఈ పరీక్షలో గెలిచావు. రేపు వచ్చి అంతఃపురంలో ఉన్న నా కుమార్తెను గుర్తించి పెళ్ళాడు. జ్ఞాపకం ఉంచుకో. నా కుమార్తెకు ఎనభైమంది పరిచారికలు ఉన్నారు. వారిలో నా కుమార్తె ఎవరో నువే గుర్తించాలిగాని నీకెవ్వరూ చూపరు! నా కుమార్తెను గుర్తించలేకపోతే నీకు పెళ్ళిలేకపోగా కొరడాదెబ్బలు తప్పవు! తెలిసిందా?" అన్నాడు రాజు.

మర్నాడు బుద్ధుడు ఒక చిన్న సంచీలో ఎలుకను ఒకదాన్ని వేసుకుని అంతఃపురానికి బయిలుదేరి వెళ్ళాడు.

వాడు వెళ్ళేసరికి ఎనభైఒక్క మంది కన్యలు, అందరూ ఒకేరకంగా బట్టలు కట్టుకుని నగలు పెట్టుకుని కూచుని ఉన్నారు. రాజుగారుకూడా అక్కడే వున్నాడు.

"వీరిలో నా కుమార్తెను గుర్తించు!" అన్నాడు రాజు.

బుద్ధుడు తన చేతిలోని సంచి విప్పి ఎలుకను ఆ కన్యల మధ్యకు గిరవాటు వేశాడు. కన్యలందరూ కెవ్వున అరిచి చిందరవందరగా అటూఇటూ పరిగెత్తారు. కాని వారిలో ఒక్కతే మూర్ఛపోయింది. వెంటనే మిగిలినవాళ్ళు ఎలుకను మరిచి మూర్ఛపోయిన కన్యకు ఉపచారాలు చేయసాగారు.

బుద్ధుడికి పరమానంద మయింది. వాడు నవ్వుతూ రాజుగారికేసి తిరిగి మూర్ఛపోయిన కన్యను చూపించి, "ఈమే మీ కుమార్తె!" అన్నాడు.

చేసేదిలేక రాజుగారు మంచి ముహూర్తం చూసి తన కుమార్తెను బుద్ధుడి కిచ్చి పెళ్ళి చేసి, అర్ధరాజ్యం అతనికి ధారపోశాడు. బుద్ధుడు అందరికన్న తానే తెలివిగలవాడి ననిపించుకుని రాజకుమార్తెతో సుఖంగా కాపరం చేశాడు.






## 2

[మాహిష్మతీనగరరాజైన యశోవర్ధనుడు, తన కుమారు లిద్దరిలో చిన్నవాడైన గుణ వర్ధనుడికి పట్టాభిషేకం చేయాలని నిశ్చయించాడు. కాని యిందుకు వీరపుర సామంతుడైన సూర్యవర్మ వ్యతిరేకించాడు. సర్పకేతుడనే సామంతుడు, గుణవర్ధనుడితో కుట్ర పన్ని, అతణ్ణి హత్యచేసేందుకు పొంచివుండి హఠాత్తుగా మీద పడ్డాడు. తరవాత—]

సూర్యవర్మ తను శత్రువ్యూహంలో చిక్కుకున్నానని గ్రహించాడు. ఆ శత్రువు ఎవడో కూడా అతడికి అర్థమైంది. "నరకండి, చంపండి! సూర్యవర్మ ప్రాణాలతో బయట పడితే, మీ ప్రాణాలు దక్కవు!" అన్న మాటలు అతడికి వినిపించినై. ఆ కంఠ స్వరం సర్పకేతుడిదని అతడు పోల్చుకున్నాడు. సూర్యవర్మ చేతికత్తి గాలిలో రివ్వురివ్వుమని భయంకరంగా ధ్వనించింది. ఎదురుగా వున్న శత్రుసైనికుడి తలతోపాటు, పక్కగా ఎదుర్కొన వచ్చిన శత్రువు కుడి చేయికూడా ఒకేదెబ్బకు గాలిలోకి ఎగిరి దూరంగా పడినై. కాని, అదే సమయంలో మరి నలుగురు శత్రుసైనికులు అతణ్ణి చుట్టుముట్టారు. సర్పకేతుడు భీకరంగా అరుస్తూ తన సైనికులను హెచ్చరిస్తున్నాడు.

తనకు మృత్యువు తప్పదని సూర్యవర్మ అనుకున్నాడు. హఠాత్తుగా అతడికి తన కుమారుడు చంద్రవర్మ గుర్తుకు వచ్చాడు. తన మరణం తరవాత సర్పకేతుడు తన





ముగించకముందే, ఒక శత్రు సైనికుడు అతణ్ణి వెనకనుంచి కత్తితో పొడిచాడు. సూర్యవర్మ 'అబ్బా' అంటూ గుర్రంమీది నుంచి కిందికి పడిపోయాడు. అదే సమయంలో అతడి శరీరంమీద మరికొన్ని కత్తి దెబ్బలు బలంగా తగిలినై.

"అదుగో, ఒకడు పారిపోతున్నాడు! వాణ్ణి తరిమి చంపండి. ఈ వార్త ముందుగా వీరపురంలో తెలియగూడదు," అంటూ సర్పకేతుడు గావుకేక పెట్టాడు. ఆ వెంటనే నలుగురైదుగురు అశ్వికులు, పారిపోతున్న సుబాహుడి వెంటబడ్డారు.

సుబాహుడు సూర్యవర్మ సేవకుల్లో చాలా నమ్మకస్థుడు. అతడు బాల్యంనుంచి సూర్యవర్మను సేవిస్తున్నవాడు. సుబాహుడు మంచి తెలివితేటలు గలవాడే కాక, చాలా ధైర్యసాహసాలుకూడా గలవాడు.

తన ప్రభువును రక్షించటం సాధ్యం కాదని గ్రహించగానే, సుబాహుడు అక్కడి నుంచి పారిపోయి, జరిగిన ఘోరం సంగతి ముందుగా చంద్రవర్మతో చెప్పాలను కున్నాడు. అంతలో సూర్యవర్మ హెచ్చరిక వినిపించింది. సుబాహుడు తన గుర్రాన్ని శత్రుఅశ్వికుల మధ్యనుంచి పక్కకు దూకించి, కొండదారివెంట నడిపాడు.

సంస్థానాన్ని ఆక్రమించుకునేందుకు ప్రయత్నించి తీరుతాడు. ముందుగా తన కుమారుణ్ణి తగు జాగ్రత్తలో వుండవలసిందిగా హెచ్చరించగలిగితే ఎంత బావుండును!

"సుబాహూ, సుబాహూ!" అని పెద్దగా కేకవేస్తూ, సూర్యవర్మ శత్రుఅశ్వికుల్లో ఒకణ్ణి తన కత్తితో నిలువునా నరికి, మరొకడి గుర్రాన్ని గుండెల్లో పొడిచి, అది అదనుగా తన గుర్రాన్ని వెనక్కు తిప్పాడు. అంతలో దూరంనుంచి, "అయ్యో, ప్రభూ!" అన్న జవాబు వినబడింది.

"నువ్వు వెంటనే వీరపురానికి వెళ్ళి, చంద్రవర్మతో...." సూర్యవర్మ మాట







గుర్రం అతివేగంగా పరిగెత్తుతున్నది. సుబాహుడు వీరపురం చేరాలంటే, ఆ కొండపైనున్న చుట్టుదారి వెంట పోవాలి. ఆ మార్గం చాలా యిరుకైనది. రెండు గుర్రాలు ఎదురుబొదురుగా తప్పుకునేందుకు మాత్రమే జాగా ఉంటుంది.

గుర్రాన్ని కొండమీదికి ఎక్కిస్తూ, సుబాహుడు వెనుదిరిగి చూశాడు. అతడిని వెంబడిస్తున్న ఆశ్వికులుకూడా తమ గుర్రాలను ఒకదాని వెనక ఒకదానిని కొండ ఎక్కిస్తున్నారు. వారికీ సుబాహుడికీ మధ్యవున్న దూరం దాదాపు బాణంవేటుకు అందీ అందనట్లుగా వుంటుంది. ఆ దూరాన్ని మరికొంత ఎక్కువ చేసుకోగలిగితే తప్ప, లేకపోతే శత్రువుల బాణాలకు తను ఆహుతి కావలసివస్తుందని సుబాహుడు గ్రహించాడు.

అతడిలా వూహిస్తున్నంతలో రివ్వుమంటూ ఒక బాణం వచ్చి, అతడికి పదీపన్నెండు గజాల వెనకగా ఠక్కుమంటూ ఒక కొండ రాయికి బలంగా తగిలి, రెండుగా విరిగి కింద పడిపోయింది.

సుబాహుడు తన గుర్రాన్ని గట్టిగా అదలించాడు. అది మరింత వేగంగా పోసాగింది. వెనక రివ్వుమనే బాణాల చప్పుడూ కేకలూ వినిపించసాగినై. కొంచెం సేపు తరవాత అతడు వెనుదిరిగి చూశాడు. శత్రుసైనికులకూ అతడికీ మధ్యవున్న దూరం మరికొంత ఎక్కువయింది. కాని, వాళ్లు వదిలేలా లేరు. అతణ్ణి అనుసరించి గుర్రాలను నడుపుతూనే వున్నారు.

మెలికలుగా కొండను చుట్టివున్న ఆ సన్నని మార్గం వెంట సుబాహుడు తన గుర్రాన్ని జాగ్రత్తగా నడుపుతున్నాడు. అతడికి కుడివైపున ఉవ్వెత్తుగా లేచిన కొండ గోడా, ఎడమవైపున అగాధంలాంటి పల్లమూ వున్నవి. గుర్రం కాలు ఏమాత్రం పట్టు తప్పినా, తను అగాధంలో పడి తునాతునకలవటం తప్పదు. అంతేకాక, క్రమంగా



చీకటి కమ్ముకోవటంతో మార్గంకూడా అంత స్పష్టంగా కనిపించటంలేదు. కాని, తనను శత్రువులు వెంబడిస్తున్నారన్న సూచనగా, గుర్రాల సకిలింపులూ, వాటి గిట్టలకు తగిలి దిగువ అగాధంలోకి జారుతున్న రాళ్ల ధ్వనీ వినిపించుతూనే వున్నవి.

కొంతసేపటికి బాగా చీకటిపడి చంద్రుడు వుదయించాడు. కొండమార్గం మరింత మెలికలు తిరుగుతున్నది. అలాంటి సమయంలో సుబాహుడికి హఠాత్తుగా శత్రు అశ్వికులు అగాధానికి అవతల వున్న దారి మీద కనిపించారు. అంతకు ముందు పదీ పదిహేను నిమిషాలక్రితం అతడు ఆ మార్గానే వచ్చాడు. మధ్య అగాధం ఒకటి వారిని వేరుచేస్తున్నా, అడ్డదారిన చూస్తే, వాళ్లు అతడికి చాలా సమీపంలో వున్నారు. "ఇప్పుడు వాళ్లు బాణాలు ప్రయోగించేందుకు మంచి అవకాశం!" అనుకుంటూ సుబాహుడు గుర్రంమీదినుంచి దిగబోయేంతలో రివ్వుమంటూ ఒక బాణం వచ్చి గుర్రం డొక్కలో బలంగా తాకింది.

గుర్రం ముందు రెండు కాళ్లనూ గాలిలోకి ఎత్తి, పెద్దగా ఘోషించి గుడ్డిదానిలా కుడివైపున వున్న కొండ అంచును తలతో ఓసారి ఢీకొట్టి, దభీమంటూ పక్కకు పడిపోయింది. దానితోపాటు సుబాహుడు కూడా





కిందికి పడిపోయాడు. మరుక్షణం గుర్రం పెద్దగా సకిలించి అగాధంవైపుకు దొర్లింది. రికాబులో కాలు చిక్కుకున్న సుబాహుడు కూడా దానితోపాటు అగాధంకేసి యీడ్వబడ్డాడు. అయిదారు పొర్లిగింతల తరవాత కొంచెం ఏటవాలుగా వున్న ఆ ప్రదేశంలో సుబాహుడి చేతికి ఒక చెట్టుకొమ్మ దొరికింది. అతడు దానిని బలంగా రెండు చేతులతోనూ పట్టుకున్నాడు. అతడి కాలినుంచి రికాబు జారిపోయింది.

గుర్రం పెద్ద ధ్వనితో రాళ్లమీదుగా మరి కొంత దూరం దొర్లుకుంటూ పోయి, పెద్ద శబ్దంతో అగాధంలో పడిపోయింది.

అగాధానికి అవతల గల కొండమార్గం మీదినుంచి ఒక్కుమ్మడిగా కేకలూ, చప్పట్లూ వినిపించినై. శత్రువులు తనను హతమార్చామని భ్రమపడుతున్నారని సుబాహుడు గ్రహించాడు. గుర్రంతోపాటు తనూ అగాధంలో పడి చిన్నాభిన్నమైపోయాడని వాళ్ళు భావిస్తున్నారు.

సుబాహుడు చెట్లకొమ్మల్లో వున్న చోటునే కదలామెదలక వుండిపోయాడు. ఆ ప్రదేశం కొంత చీకటిగా వున్నా, తెల్లని చంద్రకాంతిలో తను కదిలితే శత్రువులు గుర్తించవచ్చు. అప్పుడు మరొక బాణం తన ప్రాణాలను బలిగొంటుంది.





సుబాహుడు కొమ్మల సందుగా శత్రుసైనికులకేసి పరీక్షగా చూశాడు. వాళ్ళు గుర్రాలు దిగి అగాధం అంచుకు వచ్చి మోకాళ్ళమీద వంగి చూసి, తరవాత తమతమ గుర్రాల దగ్గిరకు వెళ్ళి కొంచెంసేపు కూడబలుక్కున్నారు. వాళ్ళు ఒకవేళ తనను గుర్తించారేమో అని భయపడుతూన్న సుబాహుడికి, అంతలోనే వాళ్ల నవ్వులు వినిపించినై. తరవాత వాళ్ళు గుర్రాలను వచ్చిన మార్గంకేసి తిప్పి, వాటిని అధిరోహించి బయలుదేరారు.

సుబాహుడు నిశ్చింతగా వూపిరి పీల్చుకున్నాడు. రికాబులో చిక్కి మెలిదిరిగిన కాలు నొప్పి పెడుతున్నా అతడికి ఆ సమయంలో అదేమంత బాధ అనిపించలేదు. తను శత్రువుల చేతబడకుండా తప్పించుకున్నాడు. సూర్యోదయం లోపల వీరపురం చేరి చంద్రవర్మకు, జరిగిన ఘోరం సంగతి చెప్పి, సర్పకేతుడిమీద పగ దీర్చుకునే ఉపాయంగురించి ఆలోచించవచ్చు.

శత్రుసైనికులు కొండమార్గం మలుపు తిరగగానే, సుబాహుడు కొమ్మల చాటునుంచి బయటికి వచ్చాడు. అతడి దుస్తులు చీలికలూ వాలికలూ అయివున్నవి. శరీరం చాలాచోట్ల దోక్కుపోయి రక్తం కారుతున్నది. అతడు అక్కడ వున్న చెట్ల ఆకులు రెండు గుప్పెళ్లనిండా కోసి, వాటిని బాగా నలిపి ఆ వచ్చిన అకురసాన్ని తన గాయాలకు పూసుకున్నాడు. అదే సమయంలో అతడికి కొండచిరుత అరుపు వినిపించింది.

ఆ అరుపు వింటూనే సుబాహుడు నిశ్చేష్టుడయాడు. ఈ కొండకోనల్లో చిరుతపులులూ, తోడేళ్ళేగాక, పెద్దపెద్ద కొండచిలువలుకూడా వుంటవని అతడికి జ్ఞాపకం వచ్చింది. అలాంటి వాటి నోటపడకుండా తను బతికి బయటపడాలంటే రక్షణకు ఏదో ఒక ఆయుధం అవసరం. కాని, తన కత్తి డాలూ గుర్రంమీద నుంచి దొర్లినప్పుడు ఎక్కడో పడిపోయినై.



సుబాహుడు అటుయిటూ కలయచూచి, అందుబాటులో కనిపించిన ఒక దృఢమైన చెట్టుకొమ్మను విరిచి చేతబట్టుకున్నాడు. తరవాత అక్కడ వున్న రాళ్లనూ, కొమ్మలనూ ఊతగా చేసుకుని కొంచెం కొంచెంగా పాకుతూ, మార్గంమీదికి వచ్చాడు.

ఇప్పుడు తను ఏమార్గాన పోతే వీరపురం దగ్గిరో సుబాహుడికి తెలుసు. అతడు గుడ్డి వెలుగులో అతి జాగ్రత్తగా నడుస్తూ, బాగా నడిరేయి అయేసరికి కొండకు అద్దరిన వున్న గ్రామప్రాంతానికి చేరాడు.

గ్రామం యింకా అల్లంత దూరం వుండనగా సుబాహుడికి కాగడాల కాంతీ, వాటి చుట్టూచేరి మాట్లాడుకుంటున్న మనుషులూ కనిపించారు. ఇంత రాత్రివేళ గ్రామవాసులకు వూరి వెలపల ఏం పని? బహుశా, యీ కాగడాలు బందిపోటు దొంగల వేమో అన్న అనుమానం కలిగింది సుబాహుడికి. అంతలోనే గుర్రపు డెక్కల శబ్దం వినబడింది. రస్తావెంట అతివేగంగా పరుగులు తీస్తున్న రౌతులు కొందరు, కాగడాలు పట్టుకునివున్న వాళ్లను సమీపించి, "ఇంకా యిక్కడే జాగుచేస్తున్నారా? ఊఁ కదలండి, నడవండి!" అని హెచ్చరిక లిస్తూ ముందుకు వెళ్లిపోయారు.




ఈ సంఘటన సుబాహుడికి ఆశ్చర్యాన్నే కాక, అనుమానంకూడా కలిగించింది. ఆ కాగడావాళ్లు బందిపోట్లు కాదు. గుర్రపు రౌతులు ధరించిన దుస్తుల తీరుచూస్తే, వాళ్లు సైనికులుగా కనిపిస్తున్నారు. అయితే, వాళ్లు వీరపుర సైనికులా? లేక సర్పకేతుడి సైనికులా? కాగడాల చుట్టూ చేరిన జనం కదిలి వెళ్లవలసిన ప్రాంతం ఏదై వుంటుంది?

ఇలాంటి ప్రశ్నలకు సమాధానాలు రాబట్టాలంటే, తను ఆ కాగడాలున్న చోటుకు వెళ్లటం ఒక్కటే మార్గమని సుబాహుడు నిశ్చయించుకున్నాడు. ఒకవేళ



వాళ్లు వీరపురం పౌరులే అయితే, వాళ్లనుంచి తను ఒక గుర్రాన్ని ఎరువు తీసుకుని త్వర త్వరగా వీరపురం చేరవచ్చు. అలాకాక వాళ్లు శత్రువులైతే...సుబాహుడు తన దుస్తులకేసి పరీక్షగా చూసుకున్నాడు. ఈ చింకిగుడ్డల్లో తను ఫలానా అని ఎవరూ గుర్తించలేరన్న ధైర్యం అతడికి కలిగింది. అతడు ముందుకు నడిచి కాగడాలవాళ్లను సమీపించాడు.

సుబాహుడు దాపులకు వచ్చేలోపలే, కాగడాల చుట్టూ చేరినవాళ్ళల్లో ఒకడు, పెద్దగా గొంతెత్తి, "అడుగో, ఎవడో బిచ్చగాడు వస్తున్నట్టున్నది. ఒరే తిరిపెం! నువు యిక అడుక్కుతిన నవసరంలేదు. తెల్లవారే లోపల మేము వీరపురాన్ని కొల్లగొట్ట పోతున్నాం. మావెంట వస్తివా, నీకూ్కడా అటూయిటూ పధ్నాలుగు తరాలకు సరిపడా సొమ్ము దొరుకుతుంది! ఏమంటావ్? వస్తావా?" అన్నాడు.

సుబాహుడు నిర్విణ్ణుడై అంతలోనే తేరుకుని, "అవును దొరా! నేనూ మీవెంట వీరపురం వస్తాను. నాకు సొమ్మేమీ అవసరం లేదు. బొక్కటానికి యింత బువ్వ దొరికితే చాలు!" అన్నాడు.

అపతలివాడు ఏదో అనబోయేంతలో కొందరు రౌతులు వేగంగా అటు వస్తూ, "సర్పకేతరాజుకూ జై!" అంటూ అరిచి, "మీలో ఎవరైనా వీరపురం వాళ్ళున్నారేమో ఇప్పుడే చూసుకోండి. తరవాత ఏడిచి లాభంలేదు!" అన్నారు.

జనంలో ఒకడు, సుబాహుణ్ణి వాళ్లకు చూపుతూ, "ఇక్కడ వున్నవాళ్లమంతా ఒకరినొకరు ఎరిగున్న వాళ్లమే! వీడెవడో కొత్తవాడు. బిచ్చగాడిలా వున్నాడు. యిప్పుడే యిక్కడికి వచ్చాడు," అన్నాడు.

రౌతులు ఒకరి ముఖాలొకరు చూసుకుని, 'హేయ్' అంటూ సుబాహుడికేసి తమ గుర్రాలను దూకించారు.—(ఇంకా వుంది)



# పగ ప్రతీకారం

పట్టువిడవని విక్రమార్కుడు మరొకసారి చెట్టువద్దకు వెళ్ళి, చెట్టుమీదినుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు సాహసోపేతుడవు. అయినా నీ సాహసాన్ని అకారణంగా ప్రదర్శించటం నాకు ఆశ్చర్యకరంగా ఉన్నది. ఎందుచేతనంటే, సాధారణంగా మానవులు తమ పగ తీర్చుకోవటంలో మాత్రమే అమానుషమైన సాహసం ప్రదర్శిస్తారు. దీనికి మంచి నిదర్శనం దుర్గ. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు ఆమె కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

పూర్వం వైశాలీనగరంలో వినయుడనే సాలె ఒకడుండేవాడు. అతను దుర్గ అనే ఆమెను పెళ్ళాడాడు. వైశాలీనగరపు రాజు అసమర్థుడు కావటంచేత ఆ నగరంలో

## బేతాళ కథలు




అరాజకం బయలుదేరి, ప్రజలలో కక్షలు ఏర్పడి, ఘోరమైన కొట్లాటలకు దారి తీశాయి. దుర్గ కాపరానికి వచ్చిన ఏడాదికే ఈ కొట్లాటలు చెలరేగాయి. ఆ నగరంలోనే వీరభద్రుడనే ధనికుడొకడున్నాడు. ఆయనకూ వినయుడికీ చాలాకాలంగా వైరం ఉన్నది. అరాజకం విజృంభించి, పట్టపగలే నడివీధులలో మనుషులు ఒకరినొకరు హత్యలు చేసుకుంటున్న రోజులలో ఈ వీరభద్రుడు తనకు శత్రువైన వినయుణ్ణి హత్యచేసేశాడు.

ఈ హత్యనుగురించి నగరంలో అందరికీ తెలిసింది. కాని అలాటి హత్యలు రోజూ జరుగుతూనే ఉండటంమూలాన దాన్ని గురించి విచారణగాని, హంతకుడికి శిక్ష విధించటంగాని జరగలేదు.

నలుగురూ సహాయంపట్టి వినయుడి శవాన్ని ఇంటికి చేర్చారు. ఆ భర్తతో దుర్గ గట్టిగా ఏడాదికూడా కాపరం చెయ్యలేదు. అతని శవాన్ని చూడగానే ఆమె కొయ్యబారినట్టయిపోయింది. ఆమె కంట ఒక్క కన్నీటి బిందువుకూడా రాలేదు. మొట్టమొదట ఆమె తన భర్తతోపాటు చనిపోదామనుకున్నది గాని, మరుక్షణమే ఆమె అభిప్రాయం మారిపోయింది.

వినయుడు చనిపోయేనాటికి దుర్గ ఆరు మాసాల గర్భవతి. "నా కడుపున కొడుకు పుడతాడు. వాడు పెద్దవాడై తన తండ్రి హత్యకు పగ తీర్చుకుంటాడు. వాడిచేత ఆ వీరభద్రుణ్ణి చంపించిగాని నేను చావగూడదు. నేను యిప్పుడే మరణిస్తే నా భర్తకోసం పగతీర్చుకునేవా రెవరున్నారు?" అనుకున్నదామె.

నిజంగానే దుర్గ వినయుడి చావుతో దిక్కులేని మనిషి అయిపోయింది. ఆమెకు తనవైపువారుగాని, భర్తవైపువారుగాని ఎవరూ లేరు. ఆమె కిప్పుడు పగే అందరు బంధువులూనూ. ఆమె నిండుచూలాలుగా ఉండి

కూడా అహోరాత్రాలు నూలు వడికి, అది అమ్మగా వచ్చిన డబ్బుతో తననూ, తన గర్భంలో ఉన్న శిశువునూ పోషించుకుంటూ ఒంటరి జీవితం గడపసాగింది. ఆమె హృదయంలో రగిలే పగకు ఆమె పడుతున్న శ్రమ చితుకులలాగా పనిచేసింది.

కనబోయే క్షణందాకా ఆమె శ్రమ చేస్తూనే ఉండి, ఎవరి సహాయమూ లేకుండానే, తాను కోరుకున్న ప్రకారం ఒక మగ పిల్లవాణ్ణి కన్నది. ఇంకా కళ్ళుకూడా తెరవని ఆ పసిగుడ్డుతో ఆమె, "నాయనా, నువు ఎందుకు పుట్టావో తెలుసునా? నీ తండ్రిని చంపిన నీచుడు, వీరభద్రుణ్ణి చంపి పగ తీర్చుకోవటానికి పుట్టావు. నీచేత ఆ పని చేయించటానికి నేను నిప్పులో దూకమన్నా దూకుతాను!" అన్నది.

ఆ కుర్రవాడికి దుర్గ విక్రముడని పేరు పెట్టుకున్నది.

విక్రముడు పుట్టిన కొద్దికాలానికే ఇంద్రసేనమహారాజు వైశాలీనగరంపైన యుద్ధం చేసి గెలిచి, ఆ నగరంలో తిరిగి శాంతి భద్రతలు నెలకొల్పాడు. ఈ ఇంద్రసేన మహారాజు మహా శక్తిసంపన్నుడు, గొప్ప ధీరుడూ, వీరుడూనూ. ఆయన వేటకు వెళ్ళితే పులులు, సింహాలు మొదలైన



ఘాతుక మృగాలను సయితం ప్రాణాలతో పట్టి తెచ్చేవాడు.

ఒకసారి ఆయన ఇలాగే వేటకు వెళ్ళి ఒక అపూర్వమైన మృగరాజును పట్టుకుని వచ్చాడు. తన ప్రతాపానికి చిహ్నంగా ఆయన ఆ సింహాన్ని వైశాలీనగరం పంపించి, నగరమధ్యంలో దానికొక గృహం కట్టించి, దాని పోషణకు తగిన ఏర్పాట్లన్నీ చేశాడు. వైశాలీ పౌరులకు సింహగృహం ఒక దేవాలయమైపోయింది. వారు సింహాలనుగురించి వినటమేగాని, బతికిఉన్న సింహాన్ని చూసి ఎరగరు. అందులోనూ ఇది చాలా పెద్ద సింహం. దాని మెడమీది జూలు పెద్ద పొద

లాగా ఉండేది. కొందరు పౌరులు ఆ సింహాన్ని సాక్షాత్తూ నరసింహస్వామిలాగా భావించి దానికి దణ్ణాలు పెట్టుకునేవారు. రోజూ వేలాది స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ సింహాన్ని చూడటానికి సింహగృహానికి వెళ్ళే వారు. ఈ సింహాన్ని చూసి పోవటానికి చుట్టుపక్కల గ్రామాలనుంచే గాక, దూర దేశాలనుంచికూడా జనం వస్తూండేవారు.

సింహంకూడా గుడిలో దేవుడి విగ్రహం లాగే ప్రవర్తించేది. ఎంతమంది తనను చూడటానికి వచ్చినా అది ఎవరికేసీ చూసేది కాదు; దాని చూపు ఎక్కడో ఉండేది. ఎవరైనా దగ్గిరకు వచ్చి దానిని పలకరించినా దానికి వినిపించినట్టుండేది కాదు.

ఇలా కొంతకాలం గడిచాక ఒకనాడు సింహం దాని గృహం నుండి బయటికి వచ్చింది. ఆ ఉదయం దానికి ఆహారం వేసినవాడు సింహగృహం తలుపు సరిగా గడియపెట్టలేదు. వాడు వెళ్ళిన కాస్సేపటికి సింహం తన పంజాతో ఇనపతలుపును తోసి ఠీవిగా బయటికి వచ్చి, షికారుకు పోతున్న దానిలాగా వీధివెంట నడవసాగింది. అది నిర్బంధంలోనుంచి తప్పించుకుని పారిపోయే లక్షణాలేమీ కనబరచలేదు.

వీధిలో నడుస్తున్న సింహం కంట బడగానే జనంలో హాహాకారాలు బయలు



దేరాయి. చావునుంచి పారిపోతున్నవారి లాగా జనం పారిపోయి ఇళ్ళలో దూరి తలుపులు గడియలు వేసుకుని భయంతో వణికి పోయారు. సింహం తప్పించుకున్నదన్న వార్త కార్చిచ్చులాగా నగరం నాలుగు మూలలకూ వ్యాపించింది. మంత్రించినట్టుగా వైశాలీనగర వీధులన్నీ కొద్దిసేపట్లో నిర్జనమైపోయాయి.

జనం పొందిన ఈ సంక్షోభాన్నికూడా సింహం గమనించినట్టు కనబడలేదు. మామూలు ప్రకారమే దాని చూపు ఎక్కడో ఉన్నది. తనను చూసి పారిపోతున్న జనాన్ని అది తరమలేదు. తనను మళ్ళీ ఎవరైనా పట్టి బంధిస్తారేమోనని అయినా అది వేగంగా నడవలేదు. షికారుకు పోయే రాజరాజులాగా అడుగులు వేసుకుంటూ, చూపును ఏ పక్కకూ మరల్చకుండా ఎదురుగా చూసుకుంటూ అది ఊరి వెలపల ఉన్న మైదానంవేపు వెళ్ళింది.

ఆ మైదానంలో ఆ సమయానికి కొందరు పిల్లలు ఆడుకుంటున్నారు. సింహం తప్పించుకు పోయిన వార్త ఊరంతా పాకినా ఈ పిల్లలకు తెలియలేదు. సింహాన్ని వారు అంత దూరంలో వుండగానే చూసి, "అమ్మయ్యో!" అని చెల్లాచెదురుగా పరిగెత్తారు. వారిలో ఒక రెండేళ్ళ కుర్రాడు





పరిగెత్తబోయి బోర్లా పడ్డాడు. పిల్లలను చూడగానే ఆడుకోబుద్ధి పుట్టినట్టుగా సింహం చెంగుచెంగున ఎగురుకుంటూ వెళ్ళి కింద పడిపోయిన పిల్లవాడిదగ్గిర పడుకుని వాడి శరీరం పైన తన పంజా పెట్టి, మళ్ళీ పర ధ్యానంలో పడిపోయింది.

ఈ పిల్లవాడు దుర్గ కొడుకు విక్రముడు.

నగరవాసులు తమ ఇళ్ళలో దూరి తలుపులు బిగించుకున్నప్పటికీ, ఎవరో ఒకరు సింహాన్ని గమనిస్తూనే ఉన్నారు. అది ఎటుగా పోతున్నదీ, ఏమి చేస్తున్నదీ ఇళ్ళలో ఉన్న ప్రజలకు వార్త తెలుస్తూనే ఉన్నది. సింహం మైదానంకేసి వెళ్ళిందన్న వార్త అనోటా అనోటా దుర్గకు చేరగానే ఆమె గుండె అవిసిపోయింది. తన కొడుకు ఆ మైదానంలో ఆడుకుంటూ ఉండటం ఆమె కొంత సేపటిక్రితం స్వయంగా చూసింది. సింహం ఆ పిల్లవాణ్ణి ఏమైనా చేసిందంటే ఆమె జీవితం శూన్యమైపోతుంది. ఇంత కాలంగా చల్లారకుండా ఆమె తన హృదయంలో పోషించుకుంటూ వస్తున్న పగ ఎందుకూ కాకుండాపోతుంది.

దుర్గ దబాలున ఇంటి తలుపు తెరుచుకుని, గబాగబా వీధివెంట నడుస్తూ మైదానంకేసి బయలుదేరింది. సింహం తనను చంపుతుందన్న భయం ఆమెకే కోశానా లేదు. అవసరమైతే ఆ సింహంతో పోరాడి అయినా సరే తన కొడుకును రక్షించుకోవాలన్న ఉద్దేశం ఒకటే ఆమె మనస్సులో పరవళ్ళు తొక్కుతున్నది.

త్వరలోనే ఆమె మైదానం చేరుకుని అక్కడ పడుకునిఉన్న సింహాన్నీ, దాని కాలికింద బోర్లాపడి ఉన్న తన కుర్రవాణ్ణీ చూసింది. వాడు కదలటం లేదు; చచ్చిపోయాడేమో ననుకున్నది. కాని ఎక్కడా రక్తం ఉన్నట్టు లేదు. దుర్గ ఊపిరి బిగబట్టి అడుగులో అడుగువేస్తూ సింహాన్ని సమీపించింది. సింహం చూపు ఎక్కడో

ఉన్నది. అది దగ్గిరకు వస్తున్న దుర్గకేసి తలకూడా తిప్పలేదు.

దుర్గ సింహానికి రెండుగజాల దూరంలోకి వెళ్లి, వణుకుతున్న గొంతుతో, "నాయనా, నరసింహస్వామీ! నా పిల్లవాణ్ణి తీసుకోకు, నాకిచ్చెయ్యి! వాడు తప్ప నాకీ ప్రపంచంలో ఇంకేమీ లేదు!" అన్నది.

సింహం వినిపించుకోలేదు.

"నాభర్తను ఆ దుర్మార్గుడు వీరభద్రుడు హత్య చేశాడు. నేను గట్టిగా ఒక్క ఏడాది కూడా సుఖపడలేదు. వాడు నా బతుకు బుగ్గిచేశాడు. నా పగ తీర్చుకోవటానికి ఈ పిల్లవాడే ఆధారం. వీడు పోయాడంటే నేను పడ్డ కష్టాలన్నీ వృథా అయిపోతాయి!" అన్నది దుర్గ సింహన్ని ఇంకా సమీపించి.

ఎన్నడూ ఎవరికేసీ చూడని సింహం తల తిప్పి దుర్గకేసి చూసింది. దుర్గ అంటున్న మాటలు దానికి అర్థమయినట్టే కనబడింది. దుర్గకు మొండిధైర్యం వచ్చింది. ఆమె ముందుకు వంగి తన పిల్లవాణ్ణి అందుకుంటూ, "నరసింహస్వామీ, తండ్రీ! నా కొడుకును నేను తీసుకుంటున్నాను! పంజా విప్పకు, నాయనా, నీ గోళ్ళు గీసుకుని నా చిట్టితండ్రి శరీరం గాయపడుతుంది! అయిపోయింది—ఒక్క క్షణం!" అంటూ పిల్ల



వాణ్ణి సింహం కాలికిందనుంచి కొంచెం కొంచెమే లాగేసింది.

సింహం దృష్టి మళ్ళీ ఎటో వెళ్ళిపోయింది. అది దుర్గకేసి గాని, ఆమె తీసుకున్న పిల్లవాడికేసిగాని చూడటం లేదు. దుర్గ తన కొడుకును అక్కున అదుముకుని చిన్నచిన్న అడుగులు వేసుకుంటూ ఇవతలికి వచ్చేసింది. తీరా అపద దాటిపోయాక ఆమెకు పెద్ద ఆనందమూ, దానితోబాటే గొప్ప నీరసమూ వచ్చేసింది. పిల్లవాడు చెక్కుచెదర లేదు. "నాన్నా" అంటే పలికాడు.

వాణ్ణి ఎత్తుకుని నిర్జనమైన వీధులవెంట తిరిగివస్తూ దుర్గ, "నాన్నా, సింహంతో

నేనన్న మాటలన్నీ విన్నావా? నేనేమన్నానో నీకు అర్థమయిందా?" అన్నది.

"అర్థమయిందమ్మా!" అన్నాడు విక్రముడు.

సింహంవద్దనుంచి తన కొడుకును తెచ్చుకుంటున్న దుర్గను ఎంతోమంది చూసి ఆశ్చర్యపోయారు. "వాడు వరంవల్ల పుట్టిన వాడు! లేకపోతే ఆ సింహానికి చిక్కి బతికి ప్రాణాలతో బయటపడటమేమిటి?" అని అందరూ అన్నారు.

ఈ సంఘటన జరిగిన నాటినుంచీ వాడికి విక్రముడనే పేరు పోయి సింహదత్తుడనే పేరు సార్థకమయింది.

దుర్గ తన కొడుకును తెచ్చుకున్న కొద్ది సేపటికే రాజుగారు పంపిన సాయుధ భటులు వచ్చి సింహాన్ని బోనులో ఎక్కించి తీసుకుపోయి తిరిగి సింహగృహంలో పెట్టారు. అది వారికి ఏమాత్రమూ ఎదురు తిరగలేదు.

ఈ సంఘటన జరిగేనాటివరకూ వీరభద్రుడు మంచిరోజులు అనుభవించాడు. ఆయన పట్టినదల్లా బంగారమయింది, గంపెడు పిల్లలను కన్నాడు, ఆయన ఇల్లు పచ్చతోరణంగా ఉంటూవచ్చింది. కాని సింహం తప్పించుకున్ననాటినుంచీ ఆయనకు చెడ్డరోజులు సంప్రాప్తమయాయి.



ఉన్నట్టుండి ఆయన భార్య అకారణంగా మరణించింది. తరవాత పిల్లలు ఒక్కొక్కరే ఏవో రోగాలు రావటమూ మరణించటమూ ప్రారంభమయింది. వీరభద్రుడి ఆస్తికూడా హరించిపోసాగింది.

వీరభద్రుడిలో పూర్వం ఎన్నడూ పాపభీతి లేదుగాని, ఇప్పుడు తల ఎత్తింది. "వినయుణ్ణి హత్యచేసినందుకు అనుభవిస్తున్నాను. ఆ సింహం మామూలు సింహం కాదు. అది దైవాంశ గలది. అందుకే వినయుడి కొడుకును నాకోసం విడిచిపెట్టింది. నాకు వాడి చేతిలో చావు తప్పదు!" అని ఆయన అనుకో నారంభించాడు.

ఆయేడుకాయేడు వస్తున్నకొద్దీ సింహదత్తుడు అజానుబాహువుగా తయారవుతున్నాడు. వాడిప్పుడు నగరంలో అందరికీ కొడుకే. వాడి కేది కావలిసినా క్షణంలో ఎవరో ఒకరు ఇచ్చేవారు. దుర్గ కష్టాలు కూడా గడిచిపోయాయి. ఆమె కిప్పుడు కావలిసినంత తిండి! ప్రతివాళ్ళూ ఆమెను అభిమానించేవారే.

తన కష్టాలు కడతేరినా దుర్గకు వీరభద్రుడిపై పగ కొంచెంకూడా తగ్గలేదు. ఆమె తన కొడుకుతో అప్పుడప్పుడు, "నాయనా, నువు ఎప్పుడు పెరిగి పెద్దవాడవై, నీ తండ్రి హత్యకు ప్రతీకారం





చేస్తావా అని ఎదురుచూస్తున్నాను. ఈలోపల ఆ వీరభద్రుణ్ణి ఒకవేళ దేవుడే హఠాత్తుగా ఎత్తుకుపోతాడేమోనని నాకు భయంగా ఉంది. ఆ దుర్మార్గుడికి చావు నీచేత రావలిసిందే గాని మరొకవిధంగా వస్తే నేను సహించలేను" అనేది.

సింహదత్తుడు తల్లి చెప్పే ఈ మాటలను చాలా శ్రద్ధగా వినేవాడు. వాడు తన సింహాన్ని చూసుకునేటందుకుగాను తరుచు సింహ గృహానికి వెళ్ళేవాడు. అప్పుడప్పుడూ ఆ సింహం వాణ్ణి గుర్తించినట్టుగా చూసేది. అది అలా చూసినప్పుడల్లా వాడికి చెప్పరాని ఆనందం కలిగేది.

సింహదత్తుడు పెరిగి పెద్దవాడవుతున్న కొద్దీ వీరభద్రుడు తన చావు వాడి చేతిలో ఉన్నదని రూఢి చేసుకోసాగాడు. ఆయన కది సహజంగానే కనబడింది. అసలాయనకు చావుభయంకూడా లేకుండాపోయింది.

సింహం రానురాను ముసలిదైపోయింది. అది ఇవాళో రేపో చస్తుందని చెప్పుకోసాగారు. సింహదత్తుడు రాత్రింబగళ్ళు సింహగృహం దగ్గిరే ఉండి సింహాన్ని చూస్తున్నాడు. అది ఇప్పుడు ఎవరికేసీ చూడటంలేదు. చచ్చి పోయేలోగా అది తనకేసి ఒక్కసారి చూడా లని వాడికి తీవ్రమైన కోరిక కలిగింది. ఆ కోరిక సిద్ధించింది కూడా. ఆ సింహం ఇంకా కొద్దిక్షణాలలో ప్రాణం విడుస్తుం దనగా తల ఎత్తి సూటిగా సింహదత్తుడి కేసి చూసింది. ఆ చూపులో సింహదత్తుడికి ఒక విచిత్రమైన విషాదభావం కనబడింది. సింహం చచ్చిపోయినాక ఎంతో కాలానికి కూడా వాడికి అది చూసిన ఆఖరి చూపు కళ్ళకు కట్టినట్టుగా ఉండిపోయింది.

కొంతకాలం గడిచింది. ఒకనాటి మధ్యాన్నం దుర్గ తన కొడుకును పిలిచి, వాడిచేతి కొక బాకు ఇచ్చి, "నాయనా, నీ తండ్రి హత్యకు ప్రతిక్రియ చేసేరోజు వచ్చింది. వీరభద్రుడు ఏదో పనిమీద పారు

గూరు వెళ్ళాడు. సాయంకాలానికి తిరిగి వస్తాడని తెలిసింది. నగరం బయట అడవిలో పొంచిఉండి ఆ హంతకుణ్ణి కడతేర్చి ఇంటికి రా!" అన్నది.

"అలాగేనమ్మా!" అంటూ సింహదత్తుడు బాకు తీసుకున్నాడు. ఆ సాయంకాలం వాడు అడవికి వెళ్ళి వీరభద్రుడి రాకకోసం ఎదురుచూడసాగాడు. సూర్యాస్తమానం కాబోయే ముందు వీరభద్రుడు ఒంటరిగా అటుగా వచ్చాడు. సింహదత్తుడు ఒక చెట్టు చాటునుంచి వీరభద్రుడిపై బడి, అతి సులువుగా కింద పడగొట్టి గుండెలమీద ఎక్కి కూచుని బాకు పైకి తీశాడు.

వీరభద్రుడు ముసలివాడైపోయాడు. సింహదత్తుడేమో మంచి పటుత్వం గల యువకుడు. ఒకవేళ వీరభద్రుడు పోరాడినా అపాయం తప్పించుకునే ఆశ లేదు. చావటానికి సిద్ధంగా ఉన్న వీరభద్రుడు సింహదత్తుడి కళ్ళలోకి చూశాడు.

మరుక్షణం సింహదత్తుడు ఎత్తిన బాకు ఎత్తినట్టే ఉండిపోయింది. ఎందుకంటే అతనికి వీరభద్రుడి కళ్ళు చూడగానే చనిపోయేటప్పుడు సింహం చూసిన చూపు జ్ఞాపకం వచ్చింది. ఆ చూపులో భయం ఏమీ లేదు, ఏదో ఒక వింత అయిన విషాదం మాత్రమే మిగిలి ఉన్నది.



సింహదత్తుడు బాకు విసిరి దూరంగా పారేసి, వీరభద్రుడి గుండెలమీది నుంచి లేచి, అలాగే అడవికేసి వెళ్ళిపోయాడు. వాణ్ణి మళ్ళీ ఎవరూ చూడలేదు.

బేతాలుడీ కథ చెప్పి, "రాజా, నన్నొక సందేహం వేధిస్తున్నది : సింహదత్తుడు తన తల్లి కోరిన ప్రకారం వీరభద్రుణ్ణి చంపి తండ్రి హత్యకు ప్రతిక్రియ ఎందుకు చెయ్యలేదు? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు ఇలా సమాధానం చెప్పాడు :

"పగ వెంటనే ప్రతిక్రియ ఉంటుంది. ఈ సందర్భంలో పగ నిజంగా దుర్గది, సింహదత్తుడిది కాదు. వాడు వీరభద్రుణ్ణి చంపటానికి ఒప్పుకున్నది తన తల్లి పగ తీర్చటానికే. అయితే తీరా ప్రతిక్రియ చేయబోయే సమయానికి సింహదత్తుడు మరొక విషయం తెలుసుకున్నాడు. అతని బుద్ధికి సింహమూ, వీరభద్రుడూ ఒకటిగానే కనిపించారు. ఇద్దరూ క్రూరస్వభావులే, ఇతరులకు ప్రాణహాని చేసినవారే. అయితే ఈ వీరభద్రుడిలాటిదే అయిఉండికూడా సింహం తనను చంపక వదలిపెట్టి తనకు తండ్రి తరవాత తండ్రి అయింది. లోకులు తనకు దాని పేరే పెట్టారుకూడా. ఆ సింహం ముసలిదై ఉండి తనకు చిక్కిఉంటే దాన్ని వాడు చంపలేడు. అలాటి స్థితిలోనే వీరభద్రుడు తనకు చిక్కాడు. తన తండ్రిని హత్య చేసినప్పటికీ ఆ ముసలివాణ్ణి చంపటానికి తగిన కారణం తనకు లేదని సింహదత్తుడికి తోచింది. వాడు తన తల్లి పగను తన పగ చేసుకోలేకపోవటంచేత ఇంటికి పోకుండా దేశాలమీద పడి వెళ్లిపోయాడు!"

రాజుకీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# కాకోలూకీయం

నీచస్వామి కథ :

మునుపు నేనొక వృక్ష-మున నుండుచుంటి
అనయ మా చెట్టు తొ-ఱ్ఱనె ఉండె పిచుక.
సాయంతన మ్మగు-సరి కది వచ్చి
ఆయా సమాచార-మంతయు చెప్పు
దినదినమ్మిటు గోష్ఠి-లను సేసికొంచు
తను జీవములవలె - తవిలియుండితిమి.
ఇటులుండ నొకనాడు - ఎంత ప్రొద్దైన
చటకమ్ము రాదయ్యె - కటకట కలిగె
కటకట పడుచు నె-క్కడి కేగె ననుచు
కటు వియోగమ్మున - కాల మీదితిని.
కొన్నాళ్ళ కట కొక - కుందేలు వచ్చి
చిన్ని కోటరమున - చేరి వసించె.
పిచుక రాదయ్యె నూ - రక దీని గూడ
ఇచట రానీకుండు - టేలని యుంటి.
మఱి కొన్నినాళ్ళలో - మంచి లావెక్కి
చరచర వచ్చె నా - చటక మచ్చటికి.
కోటర మందున్న - కుందేలు జూచి
ఘాటు మాటల దిట్టి - కదలి పొమ్మనియె.
కుందేలు : " నీదెట్లు - కోటర మయ్యె ?
ఇందుండి పోయిన - నింకెట్లు నీది ?
ఒకసారి వీడిన - నిక నీది కాదు.
ఒక పది యేండ్లుగా - నుంటి నిచ్చోట.
పది యేండ్లుగా అను-భవమున్న చాలు
అది వారిదే ధర్మ - మిది వినలేదె !"
అనిన పిచ్చుక ' ధర్మ - మనుచుంటి వింక
చని ధర్మశాస్త్రజ్ఞు-లనె చూత ' మనియె.
ఈ వివాదము పరి-ష్కృత మెట్టులగునొ
ఆ విధమ్మును చూడ - నరిగితి కూడ.
దారిలో నొక పిల్లి - దరిసెనమయ్యె
తీరమందున మౌని - తెఱగున నిల్చి
క్షణ భంగురమ్ము లో-కము శాశ్వతమ్మె ?
గుణమొక్కటే నిల్చు - కొన కనుచుండె.
అదిగొ ధర్మువు చెప్పు - నా పిల్లి నడుగు.

విద్వాన్ విశ్వం



పద మనె కుందేలు - పక్షి యూకొట్టె.
ఏమైన ఇది పిల్లి - ఏదెట్టు లగునొ
ఈ మార్గమున నిల్చి-యే అడుగుదము.
అని యవి సంగతి - యంతయు వినిచి
వినిపింపు న్యాయమ్ము - వివరమ్ముగాను.
అపరాధ మెవరిదో - అతని దినుము
కపటమ్ము లేక మా - కలతను దీర్చు.
అని యవి యడిగిన - హరహరా మాంస
మును తిను నరకమ్ము - మున్నె మానితిని
ముసలి నైతిని చెవుల్ - మూతలు పడియె
వినవిన రండు నా - వీనుల కడకు.
అని నమ్మబల్కిన - నవును గాకంచు

తన దాపునకు నవి - దఱిసిన యంత
తటుకున నొకదాని - తల పట్టుకొంచు
కటుకున నొకదాని - కాలితో పట్టి
త్రుటి మాత్రలో మింగె - దొంగ ఆ పిల్లి
అటు గాన క్షుద్రుని - అధికారమేల ?"
ఈ కాకి మాటల - కెంతేని మెచ్చి
ఆ కాన పక్షు-లయ్యవి జారుకొనియె.
కాకి నా రాచఱి-కము గూల్చెనంచు
కాకతో గూబ వె-క్కసపడి పల్కె
"నీకు నాకిక కల్గె - నిత్య వై రమ్ము
నీ కాకికులమెల్ల - నీరగు" నంచు.
ఆనాటినుండి అ-య్యా నేటి దనుక
మానదు గూబకు - మనకు వైరమ్ము

* * *

అని మంత్రి చెప్పిన - నా కాకరాజు
అనియె నీ పగ తీర్తు - నది యేమియైన.

మేఘవర్ణుడనే మంత్రి :

బలవంతులైన శ-త్రుల వంచనమున
తలక్రిందు సేయుట - తప్పదు వినుము.
ఒక ఊర నొక బ్రాహ్మ - ణుండు కర్మఠుడు
ఒకపరి యజ్ఞమ్ము-నకు యజ్ఞపశువు
యాచించి కొనిపోవు - నపుడది లాగ
తోచక భుజములం-దున నుంచి నడువ
కనుగొని మువ్వురు - కపటులు వేగ

వెనుక వెన్కగ వచ్చి - విప్రు వంచింప
తలచి అందున వాడు - తగవరివోలె
పిలిచి యిట్లనె వాడు - పెద్ద ధూర్తుండు.
"స్వామి యేమిది కుక్క - నేమిటి మీరు
ఈ మాడ్కి మోసుక - ఏగుచున్నారు?"
అన్నమాటకు కోప - మంది బ్రాహ్మణుడు
కన్నులు వోయెనా - కాదురా కుక్క
అని అదిలింప అ-య్యా కోప మేల?
చనుడు మీ యిష్టమే - సాగుసుకాక.
ఆ ధూర్తు డటు వోవ - నంత నింకొకడు
సాధింప దలచి ఆ - స్వామిని జీరి
"స్వామి యేమిది కుక్క - నేమిటి మీరు
ఈ మాడ్కి మోసుక - యేగుచున్నారు"
అని పల్కె బ్రాహ్మణు - డంత కోపింప
చనె వాడు మూడవ - జనుడును వచ్చి
ఆ మాటలే యన - ననుమాన మంది
ఏమి తోచక బ్రాహ్మ - డిస్సీ యటంచు
పశువును పడవైచి-పరుగెత్తిపోయె
పశువు నా ధూర్తులు - పట్టుక చనిరి.
అదికాక అల్పులే - అయిన పెక్కురను
ఎదిరించుటెప్పు డెం-తే కీడుసుమ్ము.

*　　*　　*

అని స్థిరజీవి వా-క్యము విన్నతోనె
వినిపింపు మది యెట్టు - లనె మేఘవర్ణి.



స్థిరజీవి :

ఒక పాము బొఱియ లో-నికి దూరునపుడు
ఒక ముల్లు గ్రుచ్చుక - నొక గాయమయ్యె.
మెలమెల్ల చీమలు - పిలపిల మూగి
కలవరపెట్టి నా-గము చంపివైచె
కావున నే చెప్పు - కరణిని చేయు
మీవు విరోధుల - నెదిరించవచ్చు.

మేఘవర్ణుడు :

అది యేమి కార్యమో - అనతి యిమ్ము
పెదవి కదల్పక - విందు నామాట.

స్థిరజీవి :

సరి నన్ను ఱెక్కల - సడలింప జేసి



చీకటి పడినంత - చెనటి ఆ గూబ
కాకుల జంప న-క్కడకు నేతెంచి
ఒక్క పిట్టయు లేమి - నూహింపలేక
తక్కన భృత్యుల - దద్దయు నడుగ—
ఇంతలో స్థిరజీవి - ఇది యదనంచు
చింతించు గూబల - చెంతకు జీరి
కాకరాజున కేను - కడుగూర్చు మంత్రి
ఏకాకి నిటు జేసె - ఏగె నారాజు
అనినంత గూబ రా - జట కేగుదెంచి
వినుపింపు నీకథ - వివరింపుమనియె.

స్థిరజీవి గూబరాజుతో :

ఏమందునో రాజ - ఏమందునయ్యా
మా మహారాజుతో - మాటల బడితి.
గూబలతో పోరు - కూడ దటన్న
గూబమిత్రుడ నంచు - కోపించె నతడు
నన్నిట్లు హింసించి - నగుబాటు చేసె
ఉన్నాడ కొనఊపి - రున్నది నాకు
కాసంత తేరుకో - గలుగు నందాక
మీ సన్నిధానమే - ఆస నాకింక
ఆపైన కాకుల - ఆవాసములను
మీ పెద్దలకు జూపి - మెప్పింతు నయ్యా

*　　*　　*

గూబరాజది విని - గొప్ప మంత్రులను
మాబాగు ! కర్తవ్య - మది తెల్పుడనియె.

మఱిమఱి నిందించి - మఱిమఱి కొట్టి
పగవారు నమ్మెడి - పగిది, ఈ చెట్టు
పగులు దాపున నన్ను - పడవైచి పొండు.
కొండపై సుఖముగా - నుండుడు మీరు
ఉండి నేనిట వారి - యునికి నెఱింగి
నమ్మించి పరిమార్చి - నా రాజు జూతు
నెమ్మదిగా పొండు - నే పని విందు

*　　*　　*

అందఱు వినునట్టు - లంతట రాజు
మందుడా యని తిట్టి - మఱిమఱి కొట్టి
స్థిరజీవి నక్కడ - ధరవైచి తాను
పరివారమును గూడి - గిరిమీది కేగె




## 3

[కీలుగుర్రంపై ఆకాశంలోకి ఎగిరిపోయిన రాజకుమారుడు అక్మార్ ఆ గుర్రాన్ని స్వాధీన పరచుకునే ఉపాయాలు తెలుసుకున్నాడు. అతను ఆ గుర్రంతోసహా ఒక దేశంలోని రాజ భవనంమీద దిగి అర్ధరాత్రి అంతఃపురంలో ప్రవేశించి అతి సౌందర్యవతి అయిన రాజ కుమార్తెను షమ్సెఅల్‌నహార్‌ను చూసి, ప్రేమించాడు. ఇంతలో ఆమె తండ్రి అక్కడికి వచ్చి అతనిని చూసి, తనకు పరువు భంగం అవుతుందనే ఉద్దేశంతో వారిద్దరికీ రహస్యంగా వివాహం చేస్తానన్నాడు. రాజుగారివద్ద ఉండే ఎనభైవేల ఆయుధభటులతోనూ ఒంటరిగా తనను యుద్ధం చేయనిచ్చినట్టయితే పెళ్ళాడతానన్నాడు అక్మార్. మర్నాడు సైన్యాన్ని ఆయత్తం చేశారు. "నా గుర్రం రాజభవనంమీది మిద్దెపై ఉన్నది. దాన్ని తెప్పించండి!" అన్నాడు అక్మార్. అందుకై రాజు తన సేనానాయకుణ్ణి పంపాడు.]

సేనానాయకుడు మిద్దె ఎక్కేసరికి అక్కడ అయనకు ఎంతో అందమైన గుర్రం కనిపించింది. అంత అందమైన గుర్రాన్ని ఆయన ఎన్నడూ చూసి ఉండలేదు. కాని ఆయన దానిని సమీపించి చూస్తే అది చంద్రకొయ్యతోనూ దంతంతోనూ చేసినదని తెలిసింది. ఇది చూసి ఆయనా, ఆయన వెంట వచ్చిన భటులూ విరగబడి నవ్వారు.

"ఈ గుర్రంతోనా వాడు యుద్ధంచేసేది? వెర్రివాడులాగున్నాడే!" అన్నాడు ఒకడు.

"ఇందులో ఏదైనా తంత్రం ఉందేమో, ఎవరు చూశారు?" అన్నాడు మరొకడు.

అర్. దయానందరావు





"నువ్వు వారిని సంహరించటానికి ఏ మాత్రమూ సంకోచపడవద్దు. ఎందుకంటే వాళ్ళు నిన్ను చంపటానికి పూర్తిగా సంసిద్ధులై ఉన్నారు!" అన్నాడు రాజు.

జనం దూరం వెళ్ళగానే అక్మార్ గుర్రం మీద ఎక్కి కూచుని మీట నొక్కాడు. అందరూ నిశ్చేష్టులై చూస్తూ ఉండగా గుర్రం గాలిలోకి లేచి, అంతకంతకూ హెచ్చే వేగంతో ఆకాశంలోకి ఎగిరిపోయింది.

రాజుగారు తన భటులతో, "వాణ్ణి పట్టుకోండి, పట్టుకోండి!" అన్నాడు. కాని ఎగిరిపొయ్యేవాణ్ణి ఎవరుమాత్రం ఎలా పట్టుకుంటారు?

"మహారాజా, వాడు మనిషికాదు. దయ్యమో, భూతమో, మాంత్రికుడో అయి ఉండాలి. అందుకే మన కళ్ళలో దుమ్ము కొట్టి తప్పించుకుపోయాడు!" అన్నారు రాజుగారి అనుచరులు.

వాడి పీడ వదిలినందుకు రాజుగారు సంతోషించాడు. ఆయన తన భవనానికి తిరిగి వెళ్ళి, తన కుమార్తెతో మైదానంమీద జరిగిన సంగతులన్నీ వివరంగా చెప్పాడు. అంతా విని తన కుమార్తె సంతోషించటానికి బదులు బావురుమని ఏడవటం చూసి రాజుకు ఆశ్చర్యం కలిగింది.

భటులు ఆ గుర్రాన్ని ఎత్తుకుని మైదానానికి తీసుకువచ్చి రాజుగారి ఎదట ఉంచారు. వెంటనే దాని చుట్టూ జనం మూగి వింతగా చూడసాగారు.

రాజుగారు ఆశ్చర్యంతో అక్మార్‌కేసి తిరిగి, "ఇదేనా నీ గుర్రం?" అని అడిగాడు. అక్మార్ అవునని తలవూపాడు. "అలాగా! అయితే దానిమీద ఎక్కి యుద్ధానికి కదులు!" అన్నాడు రాజు.

"ఈ జనాన్ని దూరంగా వెళ్ళమనండి. ఆ తరవాత నేను దాన్ని ఎక్కి మీ బలాలన్నిటినీ క్షణంలో చెల్లాచెదురు చేస్తాను!" అన్నాడు అక్మార్.





"అమ్మా, వాడు దొంగ, అబద్ధాలమారి, దుర్మార్గుడు, పాపిష్టివాడు, జిత్తులమారి వెధవ! వాడు వదిలినందుకు అల్లాకు కృతజ్ఞత చెప్పుకోవాలి గాని ఎక్కడైనా ఏడుస్తారా?" అన్నాడు రాజు.

తండ్రి ఎంత చెప్పినా రాజకుమార్తె దుఃఖం ఎక్కువయిందేగాని తగ్గలేదు. "అతను తిరిగి కంటపడేదాకా నేను నీరూ, ఆహారమూ ముట్టను. అంతదాకా ఏడుస్తూనే ఉంటాను!" అని ఆమె తండ్రికి తెలియజేసింది. కుమార్తె ఈవిధంగా శోక సముద్రంలో మునిగిపోవటంవల్ల రాజు గారినికూడా విషాదం ఆవరించింది.



ఈలోపల రాజకుమారుడు అక్మార్ తాను విడిచివచ్చిన నగరం పేరు 'సనా' అనీ, యమన్‌దేశానికి అది ముఖ్యపట్టణమనీ తెలుసుకున్నాడు. అతను తన కీలు గుర్రాన్ని స్వదేశానికేసి మళ్లించి, తాపీగా ప్రయాణంచేస్తూ, చీకటిపడిన అనంతరం తన తండ్రి ఇంటిపై దిగాడు.

అక్మార్ వెళ్లిపోయినది మొదలు సాబూర్ చక్రవర్తీ, ఆయన కుటుంబమూ విచారంలో మునిగివున్నారు. చక్రవర్తి మెట్లు దిగి వస్తున్న తన కుమారుణ్ణి మొదట చూసి తనకేదో భ్రమ కలిగిందనుకున్నాడు. తరవాత ఆయన తన కుమారుణ్ణి అలింగనం చేసుకుని ఆనందంతో కంపించిపోయాడు. అక్మార్‌ను చూసి అతని ముగ్గురు చెల్లెళ్లూ ఆనందబాష్పాలు రాల్చారు. వారి ప్రాణాలకు చచ్చినవాడు బతికి వచ్చినట్టే అయింది.

అక్మార్ తన అనుభవాలన్నిటినీ చెప్పాక చక్రవర్తి తన భటులతో, "రేపు నగరమంతా అలంకరించి ఉత్సవాలు జరిపించండి. వారం రోజులపాటు నగరంలో విందులూ, వినోదాలూ జరగాలి!" అని ఉత్తరువిచ్చాడు. మర్నాడు ఖైదులలో వున్నవారంతా విడుదల చేయబడ్డారు. రాజుగారి ఖర్చుతో బ్రహ్మాండమైన విందులూ, వేడు



కలూ జరిగాయి. రాజకుమారుడు తిరిగి వచ్చినట్టు ప్రజలకు తెలియగలందులకు అతన్ని వీధివీధీ ఊరేగించారు.

ఊరేగింపు అయాక అక్మార్ తన తండ్రిని, "కీలుగుర్రం ఇచ్చిన సిద్ధుడు ఏమయాడు?" అని అడిగాడు.

"వాణ్ణి ఒక చీకటికొట్లో పెట్టించాను! వాణ్ణి అల్లా కనికరించరాదు! అందరు ఖైదీలను విడుదల చేసేటప్పుడు, వాణ్ణి మాత్రం విడుదల చేయలేదు!" అన్నాడు చక్రవర్తి.

అక్మార్ ఆ సిద్ధుణ్ణికూడా విడుదల చేయమని కోరాడు. చక్రవర్తి ఆ ముసలి వాణ్ణి ఖైదు విడిపించి, తన సమక్షానికి పిలిపించి, ఇష్టం లేకపోయినా శాలువ కప్పి, దోసెడంత ధనం బహుమతి ఇచ్చాడు.

రాజకుమార్తెను ఆ ముసలివాడి కిచ్చి పెళ్లిచెయ్యటం ప్రశంస రాజు తీసుకు రాలేదు, సిద్ధుడు ఎత్తనూలేదు. అయితే సిద్ధుడు లోలోపల మండిపోతున్నాడు. తన కీలుగుర్రాన్ని రాజకుమారుడి చేతికి అంద నివ్వటం పొరపాటయిందని ఆయన కిప్పుడు తెలిసివచ్చింది. ఆ కుర్రవాడు దాని మర్మం తెలుసుకోనే తెలుసుకున్నాడు.

చక్రవర్తికి మటుకు కీలుగుర్రం పేరు చెబితే సింహస్వప్నమయింది. ఆయన



తన కొడుకుతో, "నాయనా, దేవుడి దయ వల్ల నువు మాకు తిరిగి దొరికావు. మరెన్నటికీ ఆ దిక్కుమాలిన గుర్రం జోలికి పోకు. అది చాలా మోసంతో కూడినది. దాని రహస్యాలలో నీకు బహుశా సగంకూడా తెలిసి ఉండవు!" అన్నాడు.

అక్మార్ ఇంటికి తిరిగి వచ్చాడేగాని సనా నగరపు రాజకుమార్తె నహర్ అతని కళ్ళలో మెదులుతూనే ఉన్నది.

వారంరోజుల పాటు అతివైభవంగా విందులూ వినోదాలూ చూస్తున్నప్పటికీ అతను ఆమెను క్షణంసేపుకూడా మరవ లేదు. చివరకు అతనికి ఆమెను మళ్ళీ చూడాలనే కోరిక తీవ్రంగా కలిగింది. తన తండ్రికి తెలియకుండా అతను మిద్దెమీదికి వెళ్ళి, కీలుగుర్రాన్ని ఎక్కి యమన్ దేశానికి బయలుదేరాడు. అతను మాయమైన సంగతి తెలియగానే చక్రవర్తి తన భవనం మీద ఉండే కీలుగుర్రంకోసం చూశాడు. అది అదృశ్యమయినట్టు స్పష్టమయేసరికి ఆయన గుండె కొయ్యబారిపోయింది.

"ఒక్కడే కొడుకు! వాడి పాలిటికి ఈ మాయలమారి గుర్రం ఎక్కడ దాపరించింది? దాన్ని అప్పుడే ఎందుకు విరగగొట్టి ముక్కలు ముక్కలు చేశానుగాను?" అని ఆయన వాపోయాడు.





రాత్రి బాగా పొద్దు పోనిచ్చి అక్మార్ సనా నగరం చేరుకుని వెనకటిలాగే రాజభవనం పైన వాలాడు. అతను అంతఃపురం ప్రవేశించి రాజకుమార్తె శయనమందిరాన్ని సమీపించేసరికి ద్వారానికి కట్టిన తెరవెనక నుంచి మాటలు వినిపించాయి.

"అమ్మా, ఆ మోసగాడికోసం ఎంత కాలం నిద్రాహారాలు మాని ఉంటావు? నీకోసం అతను ఏడుస్తుంటే పోనీ అనుకోవచ్చు! అదేమీ లేనప్పుడు నువు ఒక్కత్తెవే ఎందుకిలా ఏడవాలి! మామాట విని భోజనం చెయ్యి, కులాసాగా ఉండు!" అని చెలికత్తెలు రాజకుమార్తెకు బోధచేస్తున్నారు.



"మీరు చెప్పేదంతా అబద్ధం. అతను నన్ను ఒక్క క్షణంకూడా మరిచిపోలేడు. నాప్రేమ ఎలాటిదో, అతని ప్రేమా అలాటిదే!" అని రాజకుమార్తె కుళ్లికుళ్లి ఏడుస్తున్నది.

సరిగా ఆ సమయంలో అక్మార్ తెర పక్కకు తొలిగించి, గదిలోకి అడుగు పెట్టాడు. రాజకుమార్తె వెంటవున్న సఖులు నిర్ఘాంతపోయారు. రాజకుమార్తె ముఖం ఒక్కసారిగా వికసించింది. "నీకోసం ఎంత ఏడ్చాను! నన్నెందుకిలా వదిలేసి వెళ్లిపోయావు! నువ్వింకొక రోజు ఆగి వచ్చిఉంటే నా శవం కనిపించి ఉండేదిగద!" అన్నదామె అక్మార్‌తో.

"నేనేం చేసేది? నన్ను నీ తండ్రి ఎలా అవమానించాడో చూశావుగద! నీ తండ్రి కావటంవల్ల బతికిపోయాడు గాని లేకపోతే నా కత్తికి బలిచేసేవాణ్ణి. ఆకలిగా ఉంది, భోజనం తెప్పించు!" అన్నాడు అక్మార్.

చెలికత్తెలు వెళ్లి ఇద్దరికీ భోజనపదార్థాలు తెచ్చి వడ్డించారు. కడుపునిండా తిన్న అనంతరం అక్మార్ తన ప్రియురాలితో, "నువు ఉపోషాలు చెయ్యకు. నేను వారానికొకసారి వచ్చి నీకు కనిపిస్తూ ఉంటాను. తెల్లవారక ముందే నేను బయలుదేరి వెళ్లాలి!" అన్నాడు.





"అమ్మయ్యో, ఇంక నిన్ను ఒంటరిగా వెళ్లనివ్వను. నన్నుకూడా మీ దేశం తీసుకుపో!" అన్నది రాజకుమార్తె సహర్.

"నాకోసం మీ దేశాన్నీ, తల్లిదండ్రులనూ వదిలి ఉండగలవా?" అన్నాడు అక్మార్.

"అదంతా నాకొక లెక్క కాదు. నీకోసం అన్నీ వదిలేస్తాను!" అన్నది రాజకుమార్తె.

తెల్లవారబోయే సమయంలో అతను మిద్దె మీదికి వెళ్లాడు. రాజకుమార్తె తనకున్న ఖరీదైన దుస్తులూ, సమస్త ఆభరణాలూ ధరించి, చెలికత్తెలతో సహా అతనివెంట మిద్దెమీదికి వెళ్లింది.

అక్మార్ కీలుగుర్రంమీద ఎక్కి కూచుని, తన వెనక రాజకుమార్తెను ఎక్కించుకుని, తన నడుముకూ ఆమె నడుముకూ కలిపి ఒక కోక చుట్టేశాడు. తరవాత అతను మీట నొక్కగానే గుర్రం గాలిలోకి లేచింది.

అంతవరకూ కిక్కురుమనకుండా ఉన్న రాజకుమార్తె పరిచారికలూ, కీలుగుర్రం రాజకుమార్తెతో గాలిలోకి లేవగానే గట్టిగా ఆర్తనాదాలు చేశారు. ఆ కేకలు విని రాణీ, రాజూ మిద్దెమీదికి పరిగెత్తుకుంటూ వచ్చారు.

రాజు అక్మార్‌తో, "నాయనా, మాపైన దయచూపించు. మా కుమార్తెను మానుంచి వేరుచేయకు!" అని ఆక్రోశిస్తూ అన్నాడు.



అక్మార్ రాజకుమార్తెతో, "ఏమంటావు? నీ తల్లిదండ్రులు నీకోసం ఘోషిస్తున్నారు. వెనక్కు తిరిగిపోతావేమిటి?" అన్నాడు.

"నువ్వుంటే నాకు వాళ్ళే కాదు, ఇంకేమీ అవసరంలేదు!" అన్నది రాజకుమార్తె.

ఈ సమాధానం విని రాజకుమారుడికి పరమానందమయింది. అతను సెలయేళ్లూ పచ్చికబయళ్ళూ గల చోట నేలపై దిగి విశ్రాంతి తీసుకుంటూ ప్రయాణంచేసి, మర్నాడు తెల్లవారేసరికి తన నగరంచేరాడు. కాని అతను కీలుగుర్రాన్ని నేరుగా ఇంటికి తీసుకుపోక, నగరంవెలపల ఉండే రాజోద్యానంలో దింపాడు. తన కాబోయే భార్యను

నగరంలోకి ఊరేగింపుతో తీసుకుపోవాలని అతని ఉద్దేశం.

ఉద్యానం నడిమధ్యను ఒక చక్కని మంటపం ఉన్నది. అక్మార్ తన ప్రియురాలిని ఆ మంటపంలోకి తెచ్చి కూర్చోబెట్టి, "నే నిప్పుడు మా ఇంటికి వెళ్ళి నువు వచ్చినట్టు మా తండ్రితో చెబుతాను. కీలు గుర్రాన్ని ఇక్కడే వదిలిపోతున్నాను. దాన్ని కాస్త జాగ్రత్తగా చూస్తూ ఉండు. నీకోసం కబురు వచ్చినప్పుడు నువు నీ సొంత భవనంలోకి వచ్చేద్దువుగాని," అని చెప్పాడు.

తరవాత అతను మామూలు గుర్రం ఒకటి ఎక్కి తన ఇంటికి వెళ్ళిపోయాడు. అతన్ని చూసి చక్రవర్తి పరమానందం చెందాడు.

"నాన్నా, నావెంట సనా రాజకుమార్తె వచ్చింది. అంత అందగత్తె పర్షియాలోగాని, అరేబియాలోగాని ఉండదు. ఆమెను ఊరేగింపుతో తీసుకురావటానికి ఏర్పాట్లు చేయించు," అన్నాడు అక్మార్.

చక్రవర్తి ఊరేగింపు మహా ఆర్భాటంగా ఉండేటట్టు ఏర్పాట్లుచేసి దానివెంట తాను కూడా బయలుదేరాడు. ఊరేగింపు వెంట అన్ని రకాల వాద్యమేళాలూ ఉన్నాయి. రాజకుమార్తెకోసం అక్మార్ ఒక అందమైన సింహాసనాన్ని అద్భుతంగా అలంకరింపజేసి దాని చుట్టూ రకరకాల బానిసలను ఏర్పాటుచేశాడు. తాను తనకుగల దుస్తులన్నిటిలోకీ గొప్పవి ధరించాడు.

అయితే అతను ఊరేగింపువెంట వెళ్ళలేదు. ఆ ఊరేగింపు ఉద్యానం చేరటానికి చాలా కాలం పట్టుతుంది. అందుకని అతను వడిగల గుర్రాన్ని ఎక్కి అడ్డతోవను క్షణంలో ఉద్యానం చేరుకున్నాడు. అతను వచ్చి చూసేసరికి మంటపం నిర్జనంగా ఉంది. అందులో రాజకుమార్తె నహార్ లేదు. మంటపం బయట కీలుగుర్రం కూడా కనిపించలేదు. అక్మార్ గుండె ఆగిపోయినట్టయింది. —(ఇంకా ఉంది)





# అనుకోని అదృష్టం

రాతిపల్లి అనే గ్రామంలో వీరయ్యా అనే పరమ లోభి ఒకడుండేవాడు. ఆయనకు స్వయంగా సెంటు పొలం లేకపోయినా భార్య తాలూకు ఆస్తి ఆయన స్వాధీనం లోకి వచ్చింది. మదుపు పెట్టి అభివృద్ధి చేసుకుంటే అది మంచి రాబడి తీసుకు రాగల ఆస్తే, కాని వీరయ్యా పరమలోభి కావటంచేత డబ్బు ఖర్చు పెట్టేవాడు కాడు. చక్కని లోగిలి ఉన్నది, కాని దానికేనాడూ వెల్ల వేయించటంకాని, మరమ్మతు చేయించటంగాని లేదు. రానురాను అది దయ్యాల కొంపలాగా కనబడసాగింది. ఏళ్లతరబడి పెంకులు తిరగవేయని కారణంచేత ఇల్లు చాలాచోట్ల కురిసేది. ఇంటిని ఆనుకుని అతి విశాలమైన దొడ్డి ఉంది. కాని ఆ దొడ్డికి కంచె సరిగా లేని కారణం చేత ఊళ్లో ఉండే పందులూ, కోళ్లూ విచ్చలవిడిగా ఆ దొడ్డిలో సంచరించేవి. కాయగూరల మళ్లూ అవీ వేస్తే వాటిని పూర్తిగా ధ్వంసం చేసేవి.

వీరయ్యదగ్గిర రాముడని ఒక నౌకరుండేవాడు. వాడు తన యజమానిని ఎన్నోసార్లు బతిమాలాడు: "కాస్త ఆ కంచె బాగు చేయండి, ఎన్నో రూపాయల కూరలు పండించుదాం. ఏడాదిపొడుగునా హాయిగా ఇంటిల్లిపాతీ తినవచ్చు," అని.

దానికి వీరయ్యా, "ఏడిచినట్టే ఉంది లేరా! మీ పొదుపు నాకు తెలుసు. నాచేత పదిరూపాయలు ఖర్చు చేయించి మూడు రూపాయలు రాబడతారు. కూరలు లేకపోతే జరగదా?" అనేవాడు.

వీరయ్యా లోభి కావటమే గాక పిసినిగొట్టు కూడానూ. ఎంత డబ్బు వచ్చినా దాచేవాడే తప్ప చూస్తూ చూస్తూ కానీ ఖర్చు చేసేవాడుకాడు. తాను అతుకుల బొంతలు కట్టుకు తిరగటమే గాక తన భార్యనుకూడా

వి. నాగభూషణం



దిష్టిబొమ్మలాగా ఉంచాడు. పండగకూ పబ్బానికీ అయినా ఒక కొత్తచీరె కొనే వాడు కాడు.

వీరయ్యకు ఇద్దరు కొడుకులూ, ఇద్దరు కూతుళ్ళూ ఉన్నారు. అందరూ అందమైన పిల్లలు, తెలివిగలవాళ్ళు. పెద్దవాడు రమణకు చదువు చక్కగా అబ్బింది. వాడు వైద్యం నేర్చుకుందామంటే వీరయ్య పడనివ్వలేదు. పోనీ వ్యవసాయం చేసుకుందామన్నా వ్యవసాయపు పనిముట్లకు తండ్రి డబ్బివ్వడు. రమణకు జీవితంమీద విరక్తి పుట్టి ఎవరితోనూ చెప్పకుండా ఒక రోజు ఎటో వెళ్లిపోయాడు.



రమణ తరవాత ఆడపిల్ల సీత, చక్కని చుక్క. చేతులకు మట్టిగాజులైనా లేక పోయినా, మాసికలు వేసిన పరికిణీలూ, వోణీలూ కట్టుకున్నా ఆ పిల్ల అందం దాగేది కాదు. పెళ్లీడు వచ్చిన ఆ పిల్ల గతి మబ్బుచాటు చందమామలాగా అయింది. సీత తరవాత రుక్మిణి అనే ఆడపిల్ల ఉన్నది. దానికి సంగీతమంటే తగని ఇష్టం. కాని వీరయ్య రుక్మిణికి సంగీతం చెప్పించటానికి ససేమిరా ఒప్పుకోలేదు.

గోపీ అందరికన్నా చిన్నవాడు. వాడింకా వీధిబడి చదువు చదువుతున్నాడు.

వీరయ్య భార్య చాలా యోగ్యురాలు. ఆవిడగనక వీరయ్యతో నెగ్గుకువస్తున్నది గాని మరొకరయితే ఏ నూతిలోనో గోతిలోనో దూకి ఉందురు. ఆవిడ ఓర్పు వర్ణనాతీతం. ఇంటిఖర్చుకుగాను ఉంచుకున్న వెన్నా, నెయ్యీ మిగిల్చి చాటుగా అమ్మి ఆ వచ్చిన డబ్బుతో పిల్లలకు ఏదన్నా పిండివంటలు చేసిపెట్టటమో, ఆడపిల్లలకు కావలిసిన బట్టలు కొనటమో చేస్తూ ఉండేది.

వీరయ్యకుటుంబానికి నిజమైన మగ దిక్కు రాముడు. వాడు తెలివిగలవాడూ, సమర్థుడూనూ. ఎక్కడికి పోయి పనిచేసుకున్నా వాడికి ఇంతకన్న బాగానే జరుగు





బాటు అవుతుంది. అయితే వాడు వీరయ్యా భార్యనుచూసీ, పిల్లలను చూసీ ఉండి పోయాడు. తాను వెళ్లిపోయిన మర్నాడు వాళ్లపాట్లు కుక్కలూ నక్కలూకూడా పడ వని వాడికి తెలుసు. అదీగాక వాడు సీతను ప్రేమించాడు. సీతకూడా వాడిపై పంచ ప్రాణాలూ పెట్టుకున్నట్లుగా కనబడింది.

ఉన్న ఆస్తిని బాగుచేసుకునే నేర్పయితే వీరయ్యాకు లేదుగాని, ఏదో మాయోపాయం చేసి ఇతరుల సొత్తు కాజేసే వైనాలు బాగా తెలుసు. ఒక ఏడు వాగుకు వరదలు వచ్చి పక్క గ్రామం కొట్టుకుపోతే వీరయ్యా అక్కడికి వెళ్లి వరదలో కొట్టుకువచ్చే కర్ర సామాన్లూ, కోళ్లూ, గొర్రెలూ పట్టుకుని తన ఇంటికి తెచ్చుకున్నాడు. తాను చేసే పాపిష్టి పనులలో సహాయపడేందుకు ఆయన రాముణ్ణికూడా వెంట తీసుకుపోయేవాడు. అలా వెళ్లటం రాముడికి చాలా కష్టంగా ఉండేది. కాని యజమాని చెప్పినట్టు చేయక వాడికి తప్పేదికాదు.

ఒకనాడు వీరయ్యా రాముడితో, "ఒరే, రాముడూ, నిచ్చెన పట్టుకురా, మనం గుడికి పోవాలి!" అన్నాడు.

రాముడు ఆశ్చర్యంతో, "గుడికి నిచ్చెన దేనికీ?" అన్నాడు.



"ధ్వజస్తంభంపైన పెద్ద తేనెపట్టు పట్టింది. తెచ్చుకుందాం. మూడు వీశెల తేనె ఉంటుంది. ఎందుకు పోనివ్వాలి?" అన్నాడు వీరయ్యా.

"అది దేవుడి సొత్తు. మన కది వద్దు!" అన్నాడు రాముడు.

"దేవుడే మన సొత్తు. ఆ గుడి కట్టిన స్థలం ఎవరిదనుకున్నావు? మా మామగారి ముత్తాతది! ఆటే వాగక నిచ్చెన పట్టుకురా!" అన్నాడు వీరయ్యా.

ఇద్దరూ నిచ్చెనతోసహా గుడిదగ్గిరికి వెళ్లారు. వీరయ్యా తన భుజంమీద ఉన్న గొంగళితీసి రాముడికిస్తూ, "ఇది కప్పుకుని



వెళ్లి ఈగలను తోలి, ఈ కత్తితో తేనెపట్టు కోసుకుని చప్పున దిగిరా!" అన్నాడు.

"నేనెక్కను లెండి. అసలే యిది పాత నిచ్చెన. పైగా మెట్లన్నీ పుచ్చి ఉన్నాయి," అన్నాడు రాముడు.

"వెధవ, తినటానికి తప్ప దేనికీ పనికి రావు! నేనెక్కుతాను చూడు!" అంటూ వీరయ్య గొంగళి కప్పుకుని మెట్లెక్కాడు. ఆయన సమీపానికి వచ్చేసరికి తేనెటీగలు జుంయిమని తేనెపట్టునుంచి మేఘంలాగా లేచి వీరయ్యను చుట్టుముట్టేశాయి. ఆయన ఎంత జాగ్రత్తగా ఉన్నప్పటికీ కొన్ని ఈగలు గొంగళిలో దూరి చేతులూ, ముఖమూ కుట్టాయి. వీరయ్య రెండు మెట్లు కిందికి దిగి అంతలో కాలు జారి ఆ యెత్తునుంచి కింద పడిపోయాడు.

వీరయ్య తల కింద ఉన్న రాతినేలకు బలంగా తగిలి బద్దలై నెత్తురు కారసాగింది. ఆయన చచ్చాడనే రాముడు అనుకున్నాడు. వాడు ఆయనను అట్లాగే తీసుకుపోయి ఇంట్లో మంచంమీద పడుకోబెట్టాడు.

వీరయ్య చావలేదు. వైద్యుడు వచ్చి కట్టుకట్టాడు. రెండు వారాలలో తలగాయం మానింది. కాని వీరయ్య బుర్ర పూర్తిగా చెడింది. ఆయనకు మాట పడిపోయింది. ఎవరినీ గుర్తించలేడు. ఒక్క రాముణ్ణి చూడగానే బెదిరినట్టు అయేవాడు.

ఇప్పుడు ఇంటిపెత్తనం రాముడిచేతిలోకి వచ్చేసింది. వాడు వీరయ్య పెద్దకొడుకు రమణ బస్తీలో ఉన్నట్టు తెలుసుకుని ఇంటికి పిలిపించి, "బాబూ, నువు వైద్యం నేర్చుకోవాలంటే నేర్చుకో. నీకిప్పుడు అభ్యంతరం చెప్పేవాళ్లు లేరు!" అన్నాడు.

వీరయ్య యెన్నోయేళ్లుగా కూడబెట్టిన డబ్బు తనచేతికి రాగానే రాముడు ముందు దొడ్డికి కంచె చక్కగా అమర్చి కూరగాయలు పండించాడు. పొలాలకు ఎరువు తోలించాడు. ఇంటికి సున్నం వేయించాడు.

పెంకు తిరగవేయించాడు. చెడిపోయిన దర్వాజాలూ, కిటికీలూ మరమ్మతు చేయించాడు. ఇంతకాలానికి వీరయ్యా ఇల్లూ దొడ్డీ కళకళలాడసాగాయి. పశువులకూ, కోళ్లకూ కొట్టాలు ఏర్పడ్డాయి. ఎవరూ వొళ్లు దాచుకునేటందుకు లేదు, ఇంట్లో అందరిచేతా రాముడు పనులు చేయించాడు, అందరినీ మించి వాడు శ్రమపడ్డాడు. ఆఖరుకు వీరయ్యకూడా పనిచేశాడు. రాముడు చెయ్యమంటే చాలు వీరయ్యా యెంత కష్టమైన పని అయినా చేసేవాడు.

రాముడు పెట్టిన ఖర్చు రెండేళ్లలో తిరిగి వచ్చింది. రాబడి బాగా పెరిగింది. ఇప్పుడు అందరి వంటినా మంచి బట్టలున్నాయి. ఆడపిల్లల వంటిమీద నగలుకూడా ఉన్నాయి. ఇంతకాలానికి వాళ్ళు చూడటానికి మర్యాద అయిన మనుషులలాగా వున్నారు. రుక్మిణి సంగీతం నేర్చుకుంటున్నది. ఆ పిల్ల గొంతు చాలా మంచిది.

వీరయ్యభార్య తన పెద్దకూతురు మనస్సు గ్రహించి, "నాయనా, రాముడూ! సీత పెళ్లిమాటేమిటి? పద్దెనిమిదేళ్ళు నిండుతాయి. ఇంకెక్కడికో పోవటందేనికి? మీ ఇద్దరికీ ముడేద్దామని వుంది," అన్నది.

రాముడు సరేనన్నాడు. ఇద్దరికీ పెళ్ళి అయింది. మరుసటి సంవత్సరానికి సీత





ఒక మగబిడ్డను కన్నది. ఇంకో ఏడు గడిచింది. రమణ వైద్యుడుగా పనిచెయ్యసాగాడు. రుక్మిణి పాటలో ప్రయోజకురాలవుతున్నది. గోపీ చదువుకూడా బాగా సాగుతున్నది.

వీరయ్యకు మాట పడిపోయి నాలుగేళ్ళయింది. పొలంపని అంతా అయిపోయింది గాని, పొలాన గడ్డిమోపులు వుండిపోయాయి. వాటిని ఇంటికి చేర్చుదామని రాముడు బండి కట్టుకుని వీరయ్యను వెంటపెట్టుకుని బయలుదేరాడు. రాముడితోబాటు వీరయ్యకూడా గడ్డిమోపులు ఎత్తి బండిపై వేశాడు. ఆఖరుసారి బండి ఇల్లుచేరేటప్పటికి సూర్యాస్తమయం కావచ్చింది. బండి నించగా ఇంకా గడ్డి మిగిలిపోయేటట్టు కనిపించింది. దానికోసం మళ్ళీ రావటమెందుకని రాముడు ఆ మిగిలిన గడ్డికూడా బండిపై ఎత్తుగా వేసి కట్టి, దానిపైకి వీరయ్యను ఎక్కమని, బండి తోలుకుంటూ ఇంటికి వస్తున్నాడు.

కర్మ చాలక బండిచక్రం ఒకటి రాతిమీది కెక్కి బండి ఒరిగింది. ఆ ఒరగటంలో గడ్డిపైన కూర్చునివున్న వీరయ్య తలకిందులుగా నేలమీద పడ్డాడు. ఈసంగతి గ్రహించి వెంటనే రాముడు పగ్గాలు లాగి ఎడ్లను ఆపి, బండి దిగి వీరయ్య పడ్డచోటికి పరిగెత్తుకుంటూ వచ్చాడు.

ఈసారి పడ్డప్పుడుకూడా వీరయ్య నెత్తి అడుచుకున్నది. ఆయన లేస్తూ, "ఒరే. రాముడూ? ఈ తేనెటీగెలు ఏం కుడుతున్నాయిరా!" అన్నాడు. నాలుగేళ్ళ తరవాత ఆయన మాట్లాడిన మొదటిమాట లివే. ఈ మధ్యకాలంలో ఏం జరిగినదీ ఆయనకు తెలియదుగాని, మళ్ళీ మామూలు మనిషి మాత్రం అయాడు.

రాముడు ఆయనను కిందినుంచి లేవదీస్తూ, "అది ఈనాటి మాటా? అప్పుడే నాలుగేళ్లు కాలా?" అన్నాడు.





వీరయ్య రాముడికేసి వింతగా చూశాడు. రాముడు అర్థంలేకుండా మాట్లాడుతున్నాడని అయనకు తోచింది. కాని మరుక్షణమే పరిసరాలు చూసి, తాను పొరపాటు పడ్డట్టు తెలుసుకున్నాడు. ఎందుచేతనంటే గుడీ, ధ్వజస్తంభమూ, గొంగళీ, నిచ్చెనా ఏమీలేవు. తన ముందు గడ్డిబండీ వుంది. చుట్టూ పొలాలు. ఆయన రాముడికేసి పరిశీలనగా చూసి, "ఒరే, రాముడూ, నువు మారి పోయావురా !" అన్నాడు.

"నాలుగేళ్లయితే మారనూ?" అన్నాడు రాముడు.

ఆ నాలుగేళ్లేమిటో వీరయ్యకు చచ్చినా అంతుబట్టలేదు. ఆయన బండికేసి చూసి, "ఈ బండీ ఎవరిదిరా ?" అన్నాడు.

"మనదే," అన్నాడు రాముడు.

"మనకు బండీ లేదుగా?" అన్నాడు వీరయ్య.

"అందుకే కొన్నాం. బండి లేని వ్యవసాయం ఏం వ్యవసాయం ? ఈగడ్డి అంతా ఎట్లా ఇల్లు చేర్చేట్టూ ?" అన్నాడు రాముడు.

"ఈ గడ్డి మనకేనా? ఎవరిదగ్గిర కొన్నావేం?" అన్నాడు వీరయ్య.

"మన చేలోదే!" అన్నాడు రాముడు. ప్రశ్నలు వేసినకొద్దీ అర్థంకాని సంగతులూ, వీరయ్యకు భయం కలిగించే సంగతులూ బయటపడుతున్నాయి. అందుకని ఆయన మాట్లాడకుండా తొట్టెలో ఎక్కాడు.

బండి ఇంటిసమీపానికి వచ్చేసరికి వీరయ్య, "ఆ లోగిలి ఎవరిదిరా?" అన్నాడు.

"మనదే," అన్నాడు రాముడు.

"ఇంటో ఎవరో చక్కగా పాడుతున్నారే? మనింటో పాడేవాళ్ళెవరబ్బా ?" అన్నాడు వీరయ్య ఆశ్చర్యంగా.

"మన రుక్మిణి. మూడేళ్లుగా పాట నేర్చుకుంటున్నదిగా !" అన్నాడు రాముడు.

ఇంతలో పిల్లవాణ్ణి ఎత్తుకుని సీత ఇంటో నుంచి బయటికి వచ్చింది.

"ఎవరో గొప్పింటివారి ఆడబడుచులా కనబడుతున్నది. ఆ అమ్మాయి ఎవర్రా ?" అని అడిగాడు వీరయ్యా, తన పెద్ద కూతుర్ని గుర్తించక.

"మీ అమ్మాయి, సీతే!" అన్నాడు రాముడు.

"సీతా ? ఛీ! పిల్లవాణ్ణెత్తుకుంటే సీత ఎలా అవుతుందిరా ?" అన్నాడు వీరయ్య.

"అన్నట్టు చెప్పటం మరిచాలెండి. నాకూ సీతకూ రెండేళ్ళ క్రితం పెళ్లి అయింది. వాడు మీ మనవడు!" అన్నాడు రాముడు.

వీరయ్యకు కొంచెంకొంచెమే అర్థం కాసాగింది. కాని మొదట్లో ఆయనకు ఈ మార్పు నచ్చలేదు. ఇల్లూ దొడ్డీ కళకళ లాడటమూ, తన పిల్లలు ఖరీదైన బట్టలు కట్టుకోవటమూ, కొట్టంనిండా పశువులుండటమూ అంతా బాగానేఉన్నదిగాని ఈ బాగు కోసం ఎంత అప్పు చేశారో అని వీరయ్య దిగులుపడ్డాడు.

"ఒక్క కానీ అప్పు చెయ్యలేదు. దొడ్లో బంగారం పండుతున్నది. పొలాల్లో బంగారం పండుతున్నది. గొడ్లు సంపాదించి పెడుతున్నాయి. పెద్దబ్బాయి వైద్యుడు. అంతా రాబడే. అందరికీ కడుపునిండా తిండీ, వంటినిండా బట్టా ఉంది. అందరమూ ఇలాగే బతకవచ్చునని నేను ఏనాడో చెప్పా, మీరు వినిపించుకోలేదు. అన్నీ ఉండి అదృష్టం లేక మీపిల్లలు అలగాపిల్లలల్లే ఉండవలిసి వచ్చింది. ఇప్పుడదంతా మారిపోయింది!" అన్నాడు రాముడు.

వీరయ్య మాట్లాడలేదు. వెనకటిలాగా తన భార్యమీదా పిల్లలమీదా ధాష్టీకం చెయ్యటానికికూడా ఆయనకు ధైర్యం చాలలేదు. బాగా బతుకుతున్న కారణంచేత గోపీ దగ్గిరనుంచి అందరూ గొప్పింటివాళ్లల్లే వీరయ్య కంటికి కనిపించారు. అందుచేత ఆయన పెత్తనం రాముడికే ఉండనిచ్చి, అందరూ చెప్పినట్టు వినసాగాడు.






## 14

[ రూపధరుడి కొడుకైన ధీరమతి తన తండ్రిని గురించి వార్తలు తెలుసుకునేటందుకు పైలాస్ వెళ్ళి, తనను చంపటానికి సముద్రంమీద పొంచివున్న శత్రువులకు అందకుండా తమ పందులకాపరి ఇంటికి వచ్చి అక్కడ తన తండ్రిని కలుసుకున్నాడు. తండ్రికొడుకు లిద్దరూ కలిసి శత్రువులను తుదముట్టించటానికి రూపధరుడు ఒక ఆలోచన చేసి, అందుకుగాను ధీరమతి ఏం చెయ్యాలో చెప్పాడు. ]

తెల్లవారుతూనే ధీరమతి లేచి నగరానికి ప్రయాణమయాడు. అతను పందుల కాపరితో, "చిన్నాయనా, నేను ఇంటికి వెళ్ళాలి. మా అమ్మ నన్ను కళ్ళ చూసిన దాకా బెంగ మానదు. ఇక ఈ ముసలివా డున్నాడే, ఈయన తిరుగుడుకు అలవాటు పడ్డవాడు. ఈ మూల కూచుంటే ఆయనకేం తోస్తుంది. అందుచేత నగరానికి తెచ్చి దిగ బెట్టు. నాలుగు వీధులూ తిరిగి అకలి అయితే ఎక్కడో ఒక చోట ఇంత తిండి ముష్టెత్తుకుంటాడు!" అన్నాడు.

"అవును, నాయనా. నన్నిక్కడ ఉండ మన్నా ఉండను. ముష్టెత్తుకునేవాడికి అన్నీ తన ఇళ్లేగా? నువు వెళ్ళు, బాబూ. ఇంకాస్సేపు చలిమంట దగ్గిర కూచుని బయట కాస్త ఎండ ముదిరినాక ఈయనను వెంటబెట్టుకుని నగరానికి పోతాలే. నా వంటిన ఉన్న గుడ్డలు చూడు. ఎలా చీలి




కలూ వాలికలూ అయిఉన్నాయో! అందు చేత చలికి తట్టుకొలేను!" అని రూపధరుడు ధీరమతితో అన్నాడు.

ధీరమతి అతివేగంగా ఇంటికి వెళ్ళి పోయాడు. తన ఇంట చేరిన దుర్మార్గులతో తానూ, తన తండ్రీ కలిసి చేయబోయే యుద్ధంగురించే అతను ఆలోచిస్తున్నాడు. అతను ఇల్లు చేరుతూనే తన చేతిలో ఉన్న ఈటె ఒక స్తంభానికి ఆనించి లోపలికి వెళ్ళాడు. ఇంటి దాసీలు అతన్ని చూసి పర మానందం చెందారు.

ఇంతలోనే పద్మముఖి మేడపైనుండి దిగి వచ్చి, కొడుకును ఆలింగనం చేసుకుని, "వచ్చావా, నాయనా? నిన్ను మళ్ళీ కళ్ళ చూస్తాననుకోలేదు. మీ నాన్న గురించి తెలుసుకుందామనే ఉద్దేశంతో, నాతోకూడా చెప్పకుండా, పైలాస్‌కు వెళ్ళివచ్చావుగదా, ఏం వార్త తెచ్చావు?" అని అడిగింది.

"అమ్మా, నేను వెంట్రుకవాసిలో చావు తప్పించుకున్న మాట నిజమే గాని, మనం కంట తడిబెట్టుతూ కూర్చోవటాని కిది సమయం కాదు. నువు వెంటనే చక్కగా స్నానం చేసి, మన పగ తీరేలాగు అనుగ్రహించమని దేవుడికి మొక్కుకో! నేనీలోగా ఒకసారి ఊళ్ళోకి వెళ్ళివస్తాను. అన్నట్టు, పైలాస్‌నుంచి నావెంట ఒక అతిథి వచ్చాడు. అతనిని తీసుకువస్తాను!" అన్నాడు ధీరమతి.

ఈ అతిథి ఒక జ్ఞాని. పైలాస్ రేవునుంచి ధీరమతి బయలుదేరే సమయంలో తనను కూడా పడవ ఎక్కించుకోమని ప్రాధేయ పడ్డాడు. ధీరమతి పడవ దిగి పందుల కాపరి గుడిసెకు వెళ్ళాక, అతను మిగిలిన నావికులవెంట బయలుదేరి మరో మార్గాన నగరం చేరుకున్నాడు.

కొడుకు చెప్పినట్టే పద్మముఖి స్నానం చేసి, శుచి అయిన బట్టలు ధరించి తమ శత్రువుల సంహారం నిర్విఘ్నంగా జరిగే



లాగు అనుగ్రహించమని దేవుడికి భక్తి పూర్వకంగా మొక్కుకున్నది.

ఈలోపల ధీరమతి బయటికి వచ్చి, తన ఈటె చేతబట్టి, తన పెంపుడు కుక్కలు రెంటిని వెంటబెట్టుకుని, ఠీవిగా ఊళ్ళోకి బయలుదేరాడు. ఆ సమయంలో అతని ఇంట చేరిన శత్రువులు అతని చుట్టూ మూగి ఎంతో మంచిగా కుశల ప్రశ్నలు చేశారు; కాని వారి హృదయాలలో ద్వేషాగ్ని ప్రజ్వరిల్లుతూనే ఉన్నది.

ధీరమతి వారిని వదిలించుకుని ముందుకు సాగి తన తండ్రి తాలూకు మిత్రులు చేరివున్న స్థలానికి వెళ్ళి, అక్కడ కూచుని వారి ప్రశ్నలకు సమాధానాలు చెప్పసాగాడు.

కొంతసేపటికి అక్కడికి నావికుల పెద్ద అతిథిని వెంటపెట్టుకుని వచ్చాడు. అతను ధీరమతితో, "ప్రతాపుడు నీకిచ్చిన కానుకలు నా ఇంట ఉన్నాయి. మీ దాసీలను పంపి వాటిని తెప్పించుకో!" అన్నాడు.

"మా ఇంటిని పీడలాగా పట్టిన దుర్మార్గులు ఏ క్షణాన నా పీక కోసి నా సొత్తు పంచుకుంటారో అన్నట్టుగా ఉన్నది పరిస్థితి. ఈ కానుకలుకూడా వాళ్ళకు దక్కటం దేనికి? ప్రస్తుతం వాటిని మీ




ఇంటనే ఉండనీ. ఏనాడు నాకీ పీడ వదిలితే ఆనాడు నువే తెచ్చి వాటిని మా ఇంట్లో పడవెయ్యి," అన్నాడు ధీరమతి.

తరవాత అతను తన అతిథిని వెంటబెట్టుకుని ఇంటికి వెళ్ళాడు. హాలులో ఆసనాలన్నిటిమీదా తివాసీలు పరిచివున్నాయి. దాసీలు అతిథిచేత స్నానం చేయించి, బట్టలు కట్టబెట్టాక హాలులో అయనా, ధీరమతీ భోజనాలకు కూచున్నారు. వారు భోజనంచేస్తున్నంత సేపూ పద్మముఖి వారికెదురుగా ఒక ఆసనంమీద కూచుని వెనక ఉన్న స్తంభానికి చేరగిలబడి కదురుతో సన్నని నూలు వడకసాగింది.





భోజనాలు ముగిశాక ఆమె తన కొడుకుతో, "నాయనా, ఆ దుర్మార్గులు వచ్చే లోపున, మీ తండ్రి వార్తలు ఏమి తెచ్చావో చెబుదూ," అన్నది.

"అంతా చెబుతానమ్మా ! నేను పైలాస్‌కు వెళ్ళి నవద్యోతుణ్ణి చూశాను. అయనా, ఆయన కొడుకులూ నన్ను ఎంతో ఆప్యాయంగా చూశారు ; కాని ఆయనకు నాన్నను గురించిన వార్తలేవీ తెలియవు. అందుచేత నేనొక బండిమీద ఆయన కొడుకును వెంట తీసుకుని ప్రతాపుడుండే దేశం వెళ్ళాను. నేను చెప్పిన కథ అంతా విని ప్రతాపుడు మన ఇంట ఉన్న దుర్మార్గులపై మండిపడి, నాన్న తిరిగివస్తే వీళ్ళందరినీ చిత్రవథ చేస్తాడన్నాడు. నాన్న ఏదో దీవిలో ఉండగా చూసినట్టు సముద్రాలమీద ఉండే ముసలివాడు తనతో చెప్పినట్టు ప్రతాపుడు నాతో అన్నాడు. ఆ తరవాత నేను ఇంటికి తిరిగి వచ్చేశాను. ఇంతకంటె వార్తలేవీ లేవు," అన్నాడు ధీరమతి.

ఈ మాటలు విన్న అతిథి పద్మముఖితో, "అమ్మా, నిజం నేను చెబుతాను విను. నీ భర్త ఈ దేశానికి వచ్చేవున్నాడు. మీ యింట్లో జరుగుతున్న దారుణకాండ గురించిన అన్ని వివరాలూ అతనికి తెలుసు. ఈ దుర్మార్గులకు అతని చేతిలో మూడిం





దని నా అంతర్వాణి చెబుతున్నది," అని జోస్యం చెప్పాడు.

"బాబూ, మీ నోటి చలవవల్ల అలాగే జరగాలి గాని మీకు ఏమి ఇవ్వమన్నా ఇస్తాను!" అన్నది పద్మముఖి.

లోపల ముగ్గురూ ఈ విధంగా మాట్లాడు కుంటున్న సమయంలో ఇంటిముందున్న ఆవరణలో దుర్మార్గులందరూ చేరి వ్యాయామ పరీక్షలు చేసుకుంటున్నారు. కొందరు బరువులు దూరం విసురుతున్నారు. మరికొందరు ఈటెలను గురికేసి కొడు తున్నారు. ఇంతలో వారి ముఖ్య నౌకరు వచ్చి, "మిట్టమధ్యాన్నమయింది, ఆటలు చాలించి అన్నాలకు పదండి!" అన్నాడు. వెంటనే వాళ్ళందరు హాలులోకి పరిగెత్తుకు వచ్చి ఆసనాలపై చతికిలబడ్డారు. వాళ్ళు ఆ రోజు కోయించిన వేటలన్నీ వండి వారికి వడ్డనచేయగా వారు భోజనాలు చేయసాగారు.

ఈలోపల పందులకాపరి రూపధరుడితో, "నిన్ను మా యజమాని నగరానికి తీసుకు పొమ్మన్నాడు గద. పోదాం, బయలుదేరు. ఇప్పటికే ఆలస్యమయింది!" అన్నాడు.

దారివెంట పట్టుకుని నడపటానికి మంచి కఱ్ఱ ఉంటే ఇవ్వమని అడిగి పుచ్చుకుని, తన జోలె భుజంమీదుగా వేసుకుని రూప





ధరుడు పందులకాపరి వెంట బయలుదేరాడు. ముందు పందులకాపరి దారి తీస్తూంటే రూపధరుడు దిక్కుమాలిన బిచ్చగాడి రూపంలో, కర్రమీద బరువు మోపి నడిచే వృద్ధుడిలాగా తన సొంత ఇంటికి బయలుదేరాడు.

వారు ఒక జలపాతం ఉన్న చోటికి చేరేసరికి మంచి మంచి గొర్రెలనూ, మేకలనూ తోలుకుంటూ పోతూ కాళుడనే వాడొకడు అక్కడికి వచ్చాడు. వాడు రూపధరుణ్ణి చూసి వెటకారంగా, "ఎవడీ బిచ్చగాడు? ఒరే పందులు తోలేవాడా, నీకు ఈ పీనుగు ఎక్కడ దొరికాడు. వీళ్ళ తాడు తెగ, ఈ



బిచ్చగాళ్ళు అడుక్కుతినటానికీ, ప్రజలను వేధించటానికీ తప్ప ఇంకెందుకూ పనికి రారు. ఈ దరిద్రుణ్ణి రూపధరుడి ఇంటికి తీసుకుపోయావో, అక్కడ ఉండే పెద్ద మనుషులు వీడి పుటమారుస్తారు! ఛీ, తప్పుడు వెధవ!" అంటూ రూపధరుడి తుంటిమీద బలంగా ఒక్క తన్ను తన్నాడు.

రూపధరుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. చేతిలో ఉన్న కర్రతో ఒక్క దెబ్బకు వాడి తల పగలగొట్టటమో, వాణ్ణి అమాంతం ఎత్తి రాళ్ళకేసి కొట్టి పామును చంపినట్టు చంపటమో చేద్దామనిపించింది. కాని అందుకు అది సమయంకాదని కోపాన్ని దిగమింగుకున్నాడు.

పందులకాపరి మాత్రం ఆశ్చర్యంతో, "నీ కెంత కావరమెక్కిందిరా? యజమాని రానీ నీ ప్రాణాలు తీస్తాడు!" అన్నాడు.

"ఇంకా ఆయన రావలిసిందే! ఏనాడో చచ్చాడు! దేవతలు ధీరమతినికూడా తీసుకుపోతేనే మంచిది. లేకపోతే ఆ పెద్దమనుషుల చేతిలో తప్పక చస్తాడు!" అంటూ కాళుడు పశువులను తోలుకుంటూ ఇంటికేసి వెళ్ళాడు. వాడు తోలుకుపోతున్న మేకలూ, గొర్రెలూ రూపధరుడి ఇంట చేరిన దుర్మార్గుల విందుకే.





వాడి వెనకగా పందులకాపరీ, రూప ధరుడూ వచ్చి చేరారు. రూపధరుడు తన ఇంటికేసి చూసుకుని, "ఈ ఇల్లు రూప ధరుడిదే అయిఉండాలి. ఇంత ఇల్లు అతడికికాక ఇంకెవరికుంటుంది? లోపల భోజనాలు జరుగుతున్నట్టున్నది, వాసన తెలుస్తున్నది," అన్నాడు.

"వాసన తెలియకేం జేస్తుందిగాని మనం ఏం చెయ్యాలో త్వరగా నిర్ణయించు. ముందుగా నువే లోపలికి పోతావా? లేక నన్ను వెళ్ళిరమ్మన్నావా? నువు ఆలేసేపు బయట తారట్లాడావంటే ఎవరో ఒకరు నిన్ను ఇక్కడినుంచి తరిమేస్తారు!" అన్నాడు పందుల కాపరి.

"నువే ముందు వెళ్లిరా. ఎవరో నన్ను ఏదో చేస్తారని నాకు భయం లేదులే. దేవుడు నన్ను చాలా మొట్టికాయలు మొట్టాడు. ఇంకో మొట్టికాయ తగిలినా ఫరవాలేదు, వాటిలో చేరుతుంది!" అన్నాడు రూపధరుడు.

వారిలా మాట్లాడుకుంటూండగా అంత దూరాన ఉన్న పెంటపోగుమీద పడుకుని ఉన్న ఒక ముసలికుక్క తల ఎత్తి, చెవులు రిక్కించి రూపధరుడికేసి చూసింది. అది అసలు మంచి వేటకుక్క. దాని పేరు




"కాంతి." రూపధరుడు దానిని చిన్న పిల్లగా ఉన్నప్పుడు చేరదీసి పెంచాడు, కాని అది అక్కరకు వచ్చేలోపునే అతను యుద్ధానికి బయలుదేరి వెళ్ళిపోయాడు. ఇప్పుడు కాంతిని గురించి పట్టించుకునే వారు లేరు. అది చాలా ముసలిదైపోయి, పంటినిండా గోమార్లు పట్టుకుని, ఆ పెంట పోగుపైనే ఉంటూ చావుకోసం ఎదురు చూస్తున్నది. అది ఇప్పుడు తన యజమానిని గుర్తించి చెవులు వేలవేసి తోక ఆడించింది; కాని శరీరంలో శక్తి లేని కారణంచేత లేచి అతడి దగ్గిరకు రాలేకపోయింది. దాన్ని చూడగానే రూపధరుడి కంటి



వెంట ఒక బాష్పబిందువు రాలింది. అతను పందులకాపరికేసి తిరిగి, "ఇది చూడ టానికి జాతికుక్కలాగే ఉంది. దీన్ని ఇలా అయిపోనిచ్చారేమిటి ? ఒకవేళ ఇది అంతగా పనికిరాని కుక్కేమో !" అన్నాడు.

"అలాగా ? దాని యజమాని బతికి ఉండగా దాని దర్పం చూడవలిసింది ! వేటకు పోతే అన్ని కుక్కలకంటె ముందు పరిగెత్తి మృగాన్ని పసికట్టేది. దాని యజమాని ఎక్కడో దిక్కులేని చావు చస్తే, ఇది ఇక్కడ ఇలా దిక్కులేని చావు చస్తోంది !" అంటూ పందులకాపరి ముందుకు నడిచి ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

"కాంతి" తన యజమానిని చూసిన మరుక్షణం, అందుకే బతికి ఉన్నదానిలాగా, కళ్ళుమూసి చనిపోయింది.

పందులకాపరి లోపల అడుగుపెట్టగానే ముందుగా ధీరమతి అతన్ని చూసి, రమ్మని తల ఊపాడు. పందులకాపరి వెళ్ళి ధీరమతికి ఎదురుగా కూచున్నాడు. ఇంతలోనే రూపధరుడుకూడా కర్రమీద బరువు మోపి నడుస్తూ, శతవృద్ధు ఆకారంలో లోపలికి అడుగుపెట్టి, గడపదగ్గిరే మండిగాన్ని అనుకుని చతికిలబడ్డాడు.

ధీరమతి బల్లమీదినుంచి పెద్ద రొట్టే, పట్టెడు కూరా తీసి పందులకాపరి కిచ్చి, "దీన్ని ఆ మనిషికి పెట్టు ! అతణ్ణి మిగిలిన వాళ్ళ దగ్గిరకూడా తలా కాస్తా అడుక్కోమను," అన్నాడు.

రూపధరుడు పందులకాపరినుంచి రొట్టే, మాంసమూ అందుకుంటూ, "అయ్యాను దేవుడు చల్లగా చూడాలి ! అయన కోరికలన్నీ ఈడేరాలి !" అని దీవించాడు. అతను ఆ ఆహారం తిని, తాను చతికిలబడిన చోటినుంచి లేచి, విందు అరగించే దుర్మార్గులను సమీపించి, నిజమైన ముసలి బిచ్చగాడిలాగా, ప్రతి మనిషి దగ్గిరా చెయ్యి చాచనారంభించాడు. —(ఇంకా ఉంది)



# తమాషాలు

1. నీ యిష్టంవచ్చిన సంఖ్య, ఎన్ని అంకెలు కలదైనా సరే కోరుకో. చివరి అంకె సున్నామాత్రం కారాదు. అలా కోరుకున్న సంఖ్యలోని అంకెలన్నీ కూడి, ఆ మొత్తాన్ని కోరుకున్న సంఖ్యనుంచి తీసివెయ్యి. తీసివెయ్యగా వచ్చిన సంఖ్యలోని అంకెలలో నీ యిష్టం వచ్చినది కొట్టివేసి మిగిలిన అంకెలు నీ యిష్టంవచ్చిన క్రమంలో నాకు చెప్పు. నువు కొట్టివేసిన సంఖ్య చెప్పేస్తాను.

ఉదాహరణకు: నువు కోరిన సంఖ్య 57,963 అనుకుందాం. ఆ సంఖ్యలోని అంకెలన్నీ కూడితే 30 వస్తున్నది. పై సంఖ్యలోనుంచి 30 తీసివేస్తే మిగిలే సంఖ్య 57,933. ఇందులో ఒక మూడు కొట్టేద్దాం. మిగిలిన అంకెలను ఏదో ఒక క్రమంలో 3, 7, 5, 9 అని చెప్పగానే, కొట్టివేసిన సంఖ్య 3 అని సులువుగా చెప్పవచ్చు.

ఎలా? మనం ఒక్క విషయం గుర్తుంచుకోవాలి. మిగిలిన సంఖ్యలోని అంకె లన్నిటినీ కూడితే వచ్చేమొత్తం తొమ్మిదిచేత శేషం లేకుండా భాగించ బడుతుంది. మనం తీసుకున్న ఉదాహరణలో 5, 7, 9, 3, 3 కలిపి కూడితే 27 (మూడు తొమ్మిదులు) అవుతున్నది. కొట్టివేయగా మిగిలిన అంకెలు (3, 7, 5, 9) కూడితే 24 మాత్రమే వస్తున్నది. ఇరవైనాలుగుకు ఏ అంకె కలిపితే 9 తో శేషం లేకుండా భాగించబడుతుంది? సమాధానం 3; అదే కొట్టివేసిన అంకె.

ఈ తమాషాను ఇతర అంకెలతోకూడా చేసి చూసుకోండి.

2. పై తమాషానే మరొక విధంగాకూడా చేయవచ్చు. ఏదైనా ఒక సంఖ్య తీసుకోండి. దానిలోని అంకెలను తారుమారు చేసి మరొక సంఖ్య తయారు చేయండి. తరవాత ఒకదానిలో నుంచి ఇంకొకటి తీసివేసి మిగిలిన సంఖ్యలో ఒక అంకె కొట్టివేసి మిగతా అంకెలను చెబితే కొట్టివేసిన అంకెను చెప్పవచ్చు. చేసి చూడండి.



# బదిలీ అయిన దయ్యం

చాలా కాలం క్రితం సింహపురంలో విజయసిద్ధి అని ఒక మహా వీరుడుండేవాడు. ఆయన రాజుగారికి కొలువు చేయకపోయినా, రాజుగారి ఆప్తులలో ఒకడుగా ఉంటూ, తనకున్న దానితో స్వతంత్రుడుగా జీవిస్తూ ఉండేవాడు.

విజయసిద్ధిని యుద్ధరంగంలో ఎదుర్కొన్న వాళ్ళు ఆయనను చూడగానే కొయ్యబారి పోయేవారట. కాని ఆయన పెద్దవాడై మామూలు మనిషిలాగా జీవిస్తున్నప్పటికీ ఆయన భయంకరుడుగానే కనిపించేవాడు. చిన్నపిల్లలు ఆయన ముఖం చూస్తే చాలు కెవ్వున అరిచి ఏడవ నారంభించేవాళ్లు. పెద్దవాళ్ళకే ఆయనను తేరిపార చూడటానికి ధైర్యం ఉండేది కాదు.

విజయసిద్ధికి బాలాంబ అని ఒక్క కుమార్తె తప్ప వేరే సంతానం లేదు. ఆయన భార్య పోయి కొంతకాలమయింది. అది మొదలు బాలాంబే ఇంటికి ఆడదిక్కు. ఆమె చూడటానికి ఎంత అందంగా ఉండేదో ఇంటిపనులలో అంత నేర్పరి; తండ్రికి ఏ విషయంలోనూ లోటు రానిచ్చేది కాదు. "మా బాల నన్ను కనిపెట్టుకుని ఉన్నంత కాలమూ నాకే లోటూ ఉండదు," అని విజయసిద్ధి తరుచు, స్నేహితులతో అంటూ ఉండేవాడు.

బాలను పెళ్ళాడాలనే కోరిక సింహపురంలో అనేకమంది యువకులకు కలిగి ఉండవచ్చు. అయితే విజయసిద్ధి ఎదట బాల పెళ్ళి ప్రసక్తి తెచ్చేటందుకు ధైర్యం చాలకనో, తనకు అన్ని విధాలా అంగరక్షగా ఉన్న కుమార్తెకు ఆయన అప్పుడే పెళ్లి చెయ్యడన్న అనుమానంతోనో ఎవరూ ఆమెను పెళ్ళాడే ప్రయత్నం చెయ్యలేదు.

రాజుగారివద్ద కొలువు చేస్తున్న వీరభూపతి అనే యువకుడొకడు అప్పుడప్పుడూ వచ్చి విజయసిద్ధితోనూ, బాలాంబతోనూ

సి. శంకరనారాయణ

చనువుగా మాట్లాడి వెళ్లిపోతూండేవాడు. అతను కూడా బాలను పెళ్ళాడతానని ఎన్నడూ అనలేదు గాని, వారిద్దరికీ పెళ్ళి అయే అవకాశం ఉందని ఇంటి దాసదాసీలు అనుకుంటూ ఉండేవారు.

ఇలా ఉండగా విజయసిద్ధి ఇంటికి ఆయన దూరపు బంధువైన కుర్రవాడొకడు వచ్చాడు. అతని పేరు ఇంద్రవర్మ. విజయసిద్ధి సహాయంతో రాజుగారివద్ద కొలువు సంపాదించాలని అతని ఉద్దేశం. విజయసిద్ధి సహాయం చేస్తానని మాట ఇచ్చి బంధువు కనక ఇంద్రవర్మను తన ఇంటనే ఉంచుకున్నాడు.

బాలను చూసిన మరుక్షణంనుంచీ ఇంద్రవర్మకు ఆమెపై అంతులేని ప్రేమ కలిగింది. ఒక ఇంట్లోనే ఉండటంచేతనూ, ఇంద్రవర్మ అవసరాలన్నీ బాల స్వయంగా చూస్తూ ఉండటంచేతనూ ఇద్దరి మధ్యా త్వరలోనే చనువు చాలా ఏర్పడింది. అయినా ఇంద్రవర్మ తన మనస్సులో ఉన్న ఉద్దేశాన్ని పైకి అనటానికి జంకాడు. ముఖ్య కారణమేమంటే అతనికి విజయసిద్ధిని చూస్తే చెడ్డభయం. అతను వారి ఇంటికి వచ్చిన మొదటి పదిరోజులలో ఆయనతో గట్టిగా పదిమాటలుకూడా మాట్లాడలేదు.




ఇంకొక కారణమేమంటే బాలకు తనపైన ప్రేమ ఉన్నదీ లేనిదీ అతనికి తెలియదు. తాను అతిథి గనకా, యీడువాడు గనకా ఆమె తనతో చనువుగా మాట్లాడుతూండవచ్చు. "నేను నిన్ను ప్రేమిస్తున్నాను!" అని చెప్పేస్తే, ఆమె తనతో అసలు మాట్లాడటమే మానేస్తుందేమోనని ఇంద్రవర్మ భయపడ్డాడు.

ఇవన్నీగాక వీరభూపతి ఒకడు ఇంద్రవర్మ గొంతుకు పచ్చివెలగకాయలాగా అడ్డుపడ్డాడు. అతను అప్పుడప్పుడూ రావటమూ, దగ్గిరబంధువులాగా కలుపుగోలుగా విజయసిద్ధితో మాట్లాడటమూ, బాలతో

ఛలోక్తులాడటమూ ఇంద్రవర్మ ఒకటి రెండు సార్లు చూసి, చాలా అసూయపడ్డాడు. మిగి లినవారిలాగే అతనుకూడా బాలకూ ఈ వీరభూపతికీ పెళ్ళి అవుతుందేమోనని అనుకున్నాడు.

ఇంద్రవర్మ వచ్చిన రెండు వారాలకు విజయసిద్ధి గ్రామాంతరం బయలుదేరి వెళ్లాడు. బాలతో రోజల్లా కబుర్లు చెప్పే అవకాశం ఇంద్రవర్మకు దొరికింది. బాల కూడా ఆ అవకాశాన్ని బాగానే వినియో గించుకున్నది. ఆమె ఏపని చేస్తున్నా ఇంద్ర వర్మ కూడా కూడా తిరిగి ఏవేవో కబుర్లు చెప్పాడు. సాయంకాలం మల్లెతోటలో ఇద్దరూ విహరించారు. ఆ రాత్రి భోజనాలయాక ఇంటి ముందు మాలతీపందిరి కింద వెన్నెలలో కూచుని రాత్రి చాలా పొద్దు పోయినదాకా ఇద్దరూ కబుర్లు చెప్పుకున్నారు. తరవాత ఎవరిదారిన వారు పడుకోవటానికి తమ గదులకు వెళ్ళిపోయారు.

"నేను నిన్ను ఎంతో ప్రేమిస్తున్నాను! నన్ను పెళ్ళాడతావా?" అని బాలను అడగ టానికి ఇంద్రవర్మకు ఇంతమంచి అవకాశం మళ్ళీ దొరకదు. అయినా అతను ఆ ప్రస్తా వన ఎత్తనేలేదు. ఒకవేళ బాల, "నేను నిన్ను ప్రేమించటంలేదు!" అంటే ఇక అతను ఆ ఇంటోనుంచి వెళ్ళిపోవలిసిందే



తప్ప మరొక మార్గం లేదు. పరిగెత్తి పాలు తాగేకంటే నిల్చుని నీరు తాగటం మేలు! ఇంకా రెండుమూడు రోజులదాకా విజయసిద్ధి తిరిగిరాడు. ఇవాళలాగే అతను మిగిలిన రోజులుకూడా సరదాగా ఆమెవెంట షికార్లు తిరగవచ్చు, కబుర్లు చెప్పవచ్చు. "ప్రేమా, పెళ్ళి అంటూ మాట్లాడి ఈ కాస్త ఆనందమూ పోగొట్టుకోవటం దేనికి?" అనుకున్నాడు ఇంద్రవర్మ.

అతను తన పడకగదిలోకి వచ్చి తలుపు గడియ పెట్టి పక్కమీద కూచున్నాడో లేదో, విజయసిద్ధి గదిలోకి రావటం అతనికి స్పష్టంగా కనబడింది. ఇంద్రవర్మ నిర్ఘాంత పోయి, విజయసిద్ధి అప్పుడే తిరిగి వచ్చాడు కాబోలనుకున్నాడు. కాని ఇంతలోనే తాను తలుపు గడియ పెట్టిన మాట జ్ఞాపకం వచ్చి, విజయసిద్ధి చచ్చి దయ్యమయాడు కాబోలు ననుకున్నాడు.

ఈ లోపల ఆ ఆకారం ఒక కుర్చీలో కూర్చుని ఇంద్రవర్మతో, "నన్ను చూసి ఆశ్చర్యపడకు, నేను విజయసిద్ధి దయ్యాన్ని. నీతో మాట్లాడాలని వచ్చాను. విజయసిద్ధి ఊళ్ళో ఉండటంచేత ఇన్నాళ్ళూ పడలేదు," అన్నది.

"బతికున్నవాడికి దయ్యమేమిటి?" అన్నాడు ఇంద్రవర్మ ఆశ్చర్యంతో.






"అదే పొరపాటు జరిగిపోయింది. రెండేళ్ళ క్రితం ఈ విజయసిద్ధి చచ్చినంత పని చేశాడు. ఆయన చావు నిమిషాలమీద ఉన్న సమయంలో నేను ఆయన దయ్యంగా పని చెయ్యటానికి కుదురుకుని ఆయన శరీరంలాటి శరీరంకూడా చేయించుకున్నాను. ఇంతలో ముసలాడు తెప్పరిల్లాడు. నేను ఈ ఉద్యోగంగాని ఉద్యోగంలో చిక్కుకుపోయాను. ఇంతకూ నేను నిన్ను అడుగుదామనుకున్న దేమిటంటే, ఎవరన్నా చావబోతున్నట్టు నీకు ముందుగా తెలిస్తే నాకు మాటమాత్రం చెప్పు. నేను వాళ్ళ దయ్యంగా ఉద్యోగం సంపాదించుకుంటాను. ఈ విజయసిద్ధి ఇప్పుడప్పుడే చచ్చేలాగు కనబడడు. ఈ సంగతి నీతో మాట్లాడదామంటే విజయసిద్ధి నీ పక్కగదిలోనే పడుకుంటాడు గనక అవకాశం లేకపోయింది. నేను నీతో అనే మాటలు ఆయనకు వినపడక పోయినా ఆయనకు నీ జవాబు వినిపిస్తుందిగద. ఆయన అంటే నాకెంత భయమో చెప్పలేను. ఆయనకు భయపడి నేనీ ఆవరణలో ఎన్నడూ ఎవరికీ కనబడను కూడా లేదు. నేను కోరిన సహాయం చేస్తివా, నీ ప్రేమ ఫలించటానికి సహాయం చేస్తాను!" అన్నది దయ్యం.

తన ప్రేమ సంగతి దయ్యానికికూడా తెలియటం చూసి ఇంద్రవర్మ సిగ్గుపడ్డాడు. అతను దయ్యంతో, "దేశంలో రోజూ బోలెడంత మంది చస్తూనే ఉన్నారుగదా, ప్రయత్నిస్తే నీకు మరొకచోట ఉద్యోగం దొరకక పోయిందా?" అన్నాడు.

"బాబూ, ఈ దయ్యం ఉద్యోగాలకు ఎంత పోటీ ఉన్నదీ నీకు తెలీదు. దీనికి ఎన్నో శిఫార్సులు. స్వయంగా వెతుక్కుందామంటే ఇక్కడ ఇరుక్కుపోయాను. ఫలాని చోట ఖాళీ వస్తుందని మాటమాత్రం తెలిస్తే నాకు సహాయం చేసే మిత్రులున్నారు. నీకు దివాణం సంగతులు అందు

బాటులో ఉంటాయి గనక, జరగబోయే హత్యగాని, ఆత్మహత్యగాని ఏదన్నా ఉంటే నా చెవిన వెయ్యి! నీ రుణం ఉంచుకోను. ఈ బాలను నువు సంపాదించుకునే సహాయం నేను చేస్తాను!" అంటూ దయ్యం అంత ర్ధానమయింది.

మర్నాడుకూడా ఇంద్రవర్మ బాలతో చనువుగా రోజల్లా కబుర్లు చెప్పాడు. ఆ సాయంకాలం తోటలో ఇద్దరూ పచార్లు చేశారు. ఆ రాత్రి వెన్నెలలో మాలతి పందిరి కింద కూచుని మాట్లాడుకుంటు న్నారు. ఇంద్రవర్మ బాలతో చెపుదామను కుంటూనే ధైర్యం చాలక తన ప్రేమ ప్రసక్తి ఎత్తనే లేదు.

అకస్మాత్తుగా ఇంద్రవర్మకు బాల వెన కగా దయ్యం కనబడి, "నువు వట్టి పిచ్చి వాడులాగున్నావు, బాలను పెళ్ళాడమని అడగవేం? నువు ఎప్పుడా మాట అడుగు తావా అని ఎదురుచూస్తున్నది. రాక్షసుడి లాటి విజయసిద్ధి మళ్ళీ గ్రామాంతరం వెళ్ల టానికి ఇంకో రెండేళ్ళు పడుతుంది. ఆయన చుట్టుపక్కల ఉండగా నువు ఈ సంగతి మాట్లాడలేవు!" అన్నది దయ్యం.

"నాకా మనిషి సంగతి చెప్పకు!" అన్నాడు ఇంద్రవర్మ దయ్యంతో.



"ఏ మనిషి సంగతి?" అన్నది బాల ఆశ్చర్యంతో. ఆమెకు దయ్యం అన్న మాటలు వినిపించలేదు గాని ఇంద్రవర్మ అన్న మాట వినిపించింది.

ఇంద్రవర్మ కంగారులో నోటికి వచ్చిన మాట అనేశాడు; "ఆ భూపతి లేడూ? వాడి మాట!" అన్నాడతడు.

"ఆయనను గురించి అలా మాట్లాడటం ధర్మంకాదు. ఆయన చాలా తెలివిగలవాడు, పెద్దమనిషి. త్వరలోనే పెద్ద ఉద్యోగం వస్తుందని కూడా అనుకుంటున్నారు. ఆయన రాజుగారి సలహాదారు కావటానికి అర్హుడు కూడానూ!" అన్నది బాల.

"అదంతా నిజమే కావచ్చు గాని, నాకు ఆయన అంటే ఇష్టంలేదు!" అన్నాడు ఇంద్రవర్మ.

"నువు నాతో తిరిగి మాట్లాడితే చిక్కున పడిపోతావు. జాగర్తగా ఉండాలిసుమా. ఇంతకూ నే నడిగిన విషయం ఏమైనా వార్త సంపాదించావా? ఇప్పుడు చెప్పకు. నీ పడకగదికి రానా, లేక ఈ అమ్మాయి వెళ్ళిపాయేదాకా ఇక్కడే ఉండనా?" అన్నది దయ్యం ఇంద్రవర్మతో.

ఇంద్రవర్మకు మండిపోయింది. "నువు వెంటనే దయచెయ్యి! నీతో మాట్లాడేటందుకు నాకేమీ లేదు!" అని కసిరాడతను.

బాల అతనికేసి నిర్ఘాంతపోయి చూసింది. ఆమె ముఖం ఎర్రబారింది. "ఈ సంగతి ఇప్పటికైనా చెప్పారు, ఇంకా నయం!" అంటూ ఆమె లేచింది.

"బాలా, అదికాదు! ఒక్కక్షణం ఆగు! నా ఉద్దేశం—"అని ఇంద్రవర్మ అనే లోపునే ఆమె వెనుదిరిగైనా చూడకుండా చరచరా వెళ్ళిపోయింది.

ఇంద్రవర్మ కుంగిపోయాడు. "పాపిష్టి దయ్యమా! నా బతుకంతా బండలు చేశావు! అంతా సర్వనాశనమైపోయింది! నీ సహాయం చట్టుబండలుగానూ!" అని అతను దయ్యాన్ని తిట్టాడు.



"ఇలాటి పొరపాట్లు జరుగుతాయి మరి! వాటిని యుక్తిగా సరిదిద్దుకోవాలి! ధైర్యం వహించు!" అంటూ దయ్యం వెంటనే మాయమయింది.

ఇంద్రవర్మ ఆ రాత్రి నిద్రపోలేదు, "నేను మీ తండ్రి దయ్యంతో మాట్లాడాను— నీతో కాదు!" అంటే బాల నమ్మదు. ఒక వేళ నమ్మితే తన ఇంట దయ్యం ఉన్నదని తెలిసి బెదిరిపోతుంది; తన తండ్రి చచ్చి దయ్యమైనాడనుకుని ఆమె గుండె పగిలి పోతుంది. అలా కాదని నిజం చెప్పకపోయినా ప్రమాదమే. ఆమె ఇక ఎన్నటికీ తన ముఖం చూడదు.

అతను భయపడ్డంతా అయింది. మర్నాడు ఆమె అతనితో చాలా ముభావంగా ఉంది. అతను ఆమెతో మాట్లాడదామన్నా, ఆమె అవకాశం చిక్కనివ్వలేదు. ఆ రాత్రి ఆమె మాలతి పందిరి కింద కూచుని ఉన్నప్పుడు ఇంద్రవర్మ వెళ్ళి సమీపంగా కూచుని, "బాలా, నన్ను అపార్థం చేసుకున్నావు! నామీద నిష్కారణంగా అలిగావు!" అన్నాడు.

"నిన్నరాత్రి మీరు అన్నమాట చాలా క్రూరంగా లేదా?" అన్నది బాల.

"నేను నీతో క్రూరంగా మాట్లాడగలనా? నా మనసు విప్పి చెబితే నువు అలా ఒక్క



నాటికి అనుకోవు. ఒక్క అవాంతరం ఉండటంచేత నా మనసు విప్పి చెప్పలేకుండా ఉన్నాను!" అన్నాడు ఇంద్రవర్మ.

బాల అతనికేసి చూసి, "ఎవరా అవాంతరం? మా నాన్నేనా?" అన్నది. ఆమె ముఖం చూస్తే ఇంద్రవర్మ తనను ప్రేమిస్తున్నాడని తెలిసినట్టే కనబడింది. అతనికి కాస్త ధైర్యం పచ్చింది. తన ప్రేమ గురించి చెప్పే ఉద్దేశంతో అతను బాలకు కొంచెం దగ్గిరిగా జరుగుతూండగా, దయ్యం కనిపించి, "అసలు సంగతి ఆమెతో చెప్పావా లేదా? ఎందుకంటే విజయసిద్ధి తిరిగి వస్తున్నాడు. ఇంకో ఘడియలో ఇల్లు చేరుకుంటాడు. ఇంకో శుభవార్త. నాకు బదిలీ అయింది! దూరదేశంలో ప్రజలు తిరుగుబాటుచేసి తమ రాజును చంపేశారుట. నా మిత్రులు కొందరు నా తరఫున పనిచేసి ఎలా అయితేం నాకా రాజు దయ్యం ఉద్యోగం వచ్చేటట్టు చేశారు. ఈ విధంగా నాకష్టాలు గట్టెక్కినై. నేను త్వరగా వెళ్ళాలి! శలవు!" అని మాయమయింది.

ఇంద్రవర్మ బాలకేసి తిరిగి ఆమె చేతులు రెండూ తన చేతుల్లోకి తీసుకుని, "బాలా, నన్ను పెళ్ళాడతావా? ఈ ప్రపంచంలో నాకు నీకన్న ఇష్టమైన మనుషులెవరూ లేరు!" అన్నాడు.

"నాకుకూడా మీకన్న ఇష్టులెవరూ లేరు. మనిద్దరికీ పెళ్ళి చెయ్యమని నాన్నతో చెబుతాను. ఆయన తప్పక ఒప్పుకుంటారు!" అన్నది బాల.

అంతా సవ్యంగానే జరిగింది. ఇంద్రవర్మ తన కుమార్తెను పెళ్ళాడటానికి విజయసిద్ధి ఒప్పుకున్నాడు. అయితే అల్లుడు తన ఇంటనే ఉండిపోవాలని ఆయన కోరాడు. తరవాత ఇంద్రవర్మకు రాజుగారి కొలువులో ఉద్యోగమూ, బాలాంబతో వివాహమూ ఒక సారే జరిగాయి. తరవాత వారు చాలా కాలం సుఖంగా కాపరం చేశారు.





# ప్రకృతి వింతలు

## 2

"నాపేరు కుమేవావా. మాది కరాజా జాతి. ఎరిగున్నవాళ్లు నన్ను వావా అని పిలుస్తారు. టర్కీ కోడి తినటానికి బాగుంటుంది. నేను వండుతాను. దూరాన చేపలు పడుతూ, దాహమై నీళ్లు తాగబోతే నీళ్లు ఉప్పగా ఉన్నట్టనిపించింది. ఎక్కడో పడవ మునిగి ఉప్పునీటిలో కలిసిందని తెలిసి, జనం ఆపదలో ఉంటారని త్వరగా వచ్చాను," అన్నాడు కుర్రవాడు.

"నీరు ఉప్పగా ఉన్నంతమాత్రాన మనుషులు ఆపదలో ఉంటారని గ్రహించావా ?" అని అడిగాను.

"ఈగలున్న చోట తేనెకూడా ఉంటుందని మలోవాతాత అంటాడు," అన్నాడు వాడు.

"మీ జాతికి తెల్లవాళ్లంటే ఇష్టంలేదు గదా, మరెందుకు వచ్చావు?" అని అడిగాను.

"కష్టాల్లో ఉండేవాళ్లకి సహాయం చేయటం తనకు తాను సహాయం చేసుకోవటమేనని మలోవా తాత అంటాడు," అన్నాడు వాడు.

"బాగానే ఉంది. కాని నువు మాకెలా సహాయంచేస్తావు? నీకు పదేళ్లకన్న ఉన్నట్టు లేదే ?" అన్నాను.

"నాకు పన్నెండేళ్లు. 'చేపకు పొడుగు ప్రధానం, మనిషికి బుద్ధి ప్రధానం,' అంటాడు మలోవా తాత," అన్నాడు వాడు.

ఈ విధంగా మాట్లాడుతూనే వాడు రెండు పంగలకర్రలు నరికి మంటకు అటూ ఇటూ పాతాడు. తరవాత కోడికి ఈకలు తీసి దాన్ని కర్రలపైన కాల్చటానికి అమర్చాడు.

ఆ కుర్రవాడికి అంతమందిలో నేనెలా దొరికానో తెలీదు. మర్నాడు ఉదయమే

తిబోర్ సెకెల్య




వాడు నన్నునిద్రలేపి, "న్యకుచాప్, చేపలు పట్టటానికి కుమేవావా వెంట వస్తారా?" అని అడిగాడు.

"న్యకుచాప్" అంటే వాడి భాషలో "గడ్డం మనిషి" అని అర్థం. అప్పట్లో నాకు పెద్దగడ్డం ఉండేది. ఇండియన్లకు గడ్డం మొలవదు. అందుచేత ఇండియను జాతివారంతా నన్ను గడ్డంమనిషి అనే పిలిచేవారు.

ఈ కుర్రవాణ్ణి చూసిన క్షణంనుంచీ నాకు వాడంటే ముచ్చటవేసింది. అందు చేత నేను వాడివెంట వెళ్ళటానికి ఇష్ట పడ్డాను. వాడి తెప్ప అప్పుడే ప్రయాణానికి సిద్ధంగా ఉన్నది, చేపలు పట్టే పరికరాలన్నీ దానిలో ఉన్నాయి. ఈ పరికారాలేవంటే ఒక విల్లూ, కొన్ని బాణాలూ, ఒక పంట్రకోలానూ. పంట్రకోలను ఒక పొడుగుపాటి కర్ర చివర ఇనప ములికి వేసి చేశారు. దానిని తెప్ప యొక్క ముందుభాగానికి నిడివి గల తాడుతో కట్టారు. మరీ పెద్ద చేపలు పట్టటానికి ఈ పంట్రకోల ఉపయోగ పడుతుంది.

కుర్రవాడు తెప్ప వెనకభాగంలో కూచుని చిన్న తెడ్డుతో తెప్పను ఉపాయంగా నడపసాగాడు. ఈ తెప్పను ఒకే చెట్టుబోదెతో తయారుచేశారు. ఉదయపు గాలి చాలా శుచిగా ఉన్నది. అరాగ్వేనది రెండుపక్కలా దట్టమైన అరణ్యం ఉన్నది. మా తెప్ప నది ఎడమవేపు తీరంవెంబడే పోతున్నది. మాకు అనేక మృగాల అరుపులు వినవస్తున్నాయి.

"అదుగో, అ గట్టిగా అరిచేది ఒక రకం కోతి. దాన్ని బొబ్బకోతి అంటారు," అన్నాడు కుమేవావా. మా తెప్ప దానివేపు వెళ్ళింది. నన్ను తెడ్డు వెయ్యమని సంజ్ఞచేసి, వాడు తెప్పను ఒక ఎత్తయిన పెద్ద చెట్టువద్ద ఒడ్డు పట్టించాడు. ఆ చెట్టుకొమ్మలు భారీగా నది లోకి వేళ్ళాడుతున్నాయి.

"అదుగో! కనపడిందా?"

చెట్టుచిటారు కొమ్మల్లో నాకు బొబ్బకోతి కనబడింది. అది పెట్టే బొబ్బలు చూసి ఏ సింహమంతో ఉంటుందనుకున్నాను, కాని అది మామూలు కుక్క ప్రమాణంలో మాత్రమే ఉన్నది. అది అరవదలిచినప్పుడు దాని మెడలో ఉండే తిత్తినిండా గాలి పోసుకుంటుంది. ఆ గాలి విడిచేటప్పుడు అది చేసే భయంకరమైన చప్పుడుకు చాలా జంతువులు బెదురుతాయనుకుంటాను.

మేము చెట్టుకింద కూచుని కోతిని గమనిస్తూండగా రెండు వింతపక్షులు వచ్చి ఆ చెట్టుపై వాలాయి. వీటిని "టూకాన్" లంటారు. వీటి రెక్కలు నల్లగా ఉన్నాయి, మెడచుట్టూ పసుపుపచ్చని చార ఉన్నది. పక్షులెంత ఉన్నాయో, వీటి ముక్కులూ అంత ఉన్నాయి. ఈ బ్రహ్మాండమైన ముక్కులుకూడా పసుపుపచ్చగా ఉన్నాయి. ఇవి ఎగిరేటప్పుడు ముక్కుల బరువుకు తలకిందులు కావా అని చూసేవారికి అనిపిస్తుంది. గాని, నిజానికి అవి డొల్లముక్కులు. వాటిలో గాలి తప్ప ఏమీ ఉండదు.

కుఱ్ఱవాడు ఒక పొదకేసి చూపించాడు. వాడు ఏం చూడమన్నాడో మొదట నాకు తెలియలేదు. ఆ పొదనిండా చిన్నచిన్న పిట్టలున్నట్టు నాకు చివరకు తెలిసివచ్చింది.




అవి నిజంగా చాలా చిన్న పక్షులు. వాటిలో కొన్ని తుమ్మెదలంతే ఉన్నాయి. అవి ఝుంకార పిట్టలు. వీటిలో అనేక రంగులున్నాయి. ఒకదాని ముక్కు మరీ సన్నగా, అమిత పొడుగుగా ఉన్నది. అవి తమ రెక్కలను ఎంత వేగంగా ఆడిస్తాయంటే వాటిని మనం దాదాపు చూడలేం. ఇలా చేయటంవల్ల అవి గాలిలో ఒకేచోట చాలాసేపు నిలిచి ఉండి ఒకదానితో ఒకటి మాట్లాడుకుంటాయి, లేదా ఏ కొమ్మమీద వాలాలో నిర్ణయించుకుంటాయి. ఆ పొదనిండా ఎన్నో పిట్టలుండి, అన్నీ ఒకేసారి మాట్లాడుతున్నాయి. ఆ రొదలో ఒకదాని

మాట ఇంకొకదానికి ఎలా బోధపడుతుందో నాకు తెలియలేదు. అకస్మాత్తుగా పిట్టల సందడి నిలిచిపోయింది. అరణ్యంలోని ఇతర జంతువుల అరుపులు కూడా ఆగిపోయాయి. అరణ్యమంతా ఒక్కసారిగా నిశ్శబ్దమయింది. చెట్టుకొమ్మపైనున్న రెండు కోతులుమాత్రం ఏవో గుసగుసలాడుతున్నాయి.

"జంతువులు ప్రమాదం సూచిస్తున్నాయి, మనం ఇక్కడినుంచి వెంటనే వెళ్ళిపోదాం," అన్నాడు కుర్రాడు.

మేము తెప్పను ఒడ్డునుంచి తోసి తెడ్లు వేస్తూ నదిమధ్యకు వెళ్ళి, ఏం జరుగుతుందోనని చూడసాగాము.

కొంచెంసేపయాక పొదల మధ్యనుంచి ఒక పెద్ద, బలిష్ఠమైన "జాగ్వార్" పులి, నింపాదిగా అడుగులు వేసుకుంటూ, ఠీవిగా వచ్చింది. మిగిలిన జంతువులన్నీ ఎందుకు దాక్కున్నాయో మా కర్థమయింది.

"జాగ్వార్, అరణ్యానికి రాజు," అని కుర్రాడు నాతో రహస్యంగా అన్నాడు.

జాగ్వార్ తాపీగా నది ఒడ్డుకు వచ్చి నీరు తాగటానికి ఆగింది. మేము ఊపిరి బిగబట్టి దానినే గమనిస్తున్నాం. అడవి జంతువులు కూడా ఆ పనే చేస్తూ ఉండి ఉండాలి, ఎందుకంటే ఆ చుట్టుపక్కల ఎక్కడా ఎలాటి చప్పుడూ లేదు. అది తిరిగి పొదలలో ప్రవేశించి అదృశ్యమైనాకగాని అరణ్యానికి మళ్ళీ చైతన్యం రాలేదు. మేము నదివాలున తెప్పను నడుపుతూ బయలుదేరాం.

కొంత దూరం వెళ్ళాక దూరాన్నుంచి మృదువైన ఝుంకారం వినిపించింది. రాను రాను ఆ మోత పెద్దదై, బ్రహ్మాండమైన హోరుగా మారింది. అదేమిటన్నట్టు కుర్రవాడికేసి చూశాను.

"ఝరి! నదికి అలవాటు లేనివాళ్ళకు చాలా అపాయం!" అన్నాడు వాడు.

—(ఇంకా వుంది)



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

**1958 అక్టోబర్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు**





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాక్యలకూ సంబంధం వుండాలి.)

★ అగస్టు నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:-చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ. మద్రాసు-26.

---

## అగస్టు నెల పోటీ ఫలితాలు

**మొదటి ఫోటో :** కాయకష్టము...

**రెండవ ఫోటో :** మా కయిష్టము

పంపినవారు : బి. మల్లంణ, నందవరం పోస్టు,
ఆదోని తాలూకా, (కర్నూలు జిల్లా.)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒకనాటి సాయంకాలం దాసూ, వాసూలు తోటలో కూర్చుని తమ పెంపుడు పావురాళ్ళకు గింజలు వేస్తున్నారు. అంత దూరంలో 'టైగర్' ఆడుకుంటున్నది. ఆ సమయంలో హఠాత్తుగా పెద్ద డేగ ఒకటి ఆకాశంలోంచి రివ్వుమంటూ పావురాళ్ళను తన్నుకుపోయేందుకు కిందికి దిగింది. అది సమీపించేలోగా పావురాళ్లు చెట్లల్లోకి పారిపోయినై. 'టైగర్' ఒక్క గంతున వెళ్ళి డేగ తోక పట్టుకోబోయింది. తిక్కరేగిన డేగ 'టైగర్' వెంట బడింది. 'టైగర్' ఆ చెట్టు చాటుకూ, యీ చెట్టు చాటుకూ పరిగెత్తేసరికి, దాన్ని వెంబడించి తన్నబోయిన డేగ కాస్తా, చెట్టుబోదెలకు బలంగా కొట్టుకుని కాళ్ళూ రెక్కలూ విరిగి కిందపడింది.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26.—Controlling Editor: SRI 'CHAKRAPANI'

# ఇది చదివితే మీరు ఆశ్చర్యపడతారు

రోమన్ చక్రవర్తి. నీరో. కాలంలో గాజుగ్లాసు ధర రు. 27,000/- వుండేది ! అభాగ్యుడైన బానిస గ్లాసును పగులగొట్టితే ప్రాణాం తకమే ఆ గ్లాసులే ఇప్పుడు ఒక్కొక్కటి అయిదారు అణాలకు ఏ దుకాణంలోనైనా దొరుకుతున్నాయి.





రాజ భొక్కసమునకు అలవిగాని వస్తువు లున్నాయి. బాబర్ చక్రవర్తి కుమారుడు హుమాయూన్‌కు ఒకమాటు చాలా జబ్బుచేసింది. వైద్యులంతా ఆశ వదులుకొన్నారు. బాబర్ తన కుమారుని పడక చుట్టూ ప్రదక్షిణం చేసి, ఇలా ప్రార్థించాడు: "ఓ దేవా నా కుమారుని రక్షించి నా ప్రాణము



తీసుకో !" ఆయన ప్రార్థన ఫలించింది; ఈనాడు గాజుగ్లాసు అతి చౌకైపోయింది, కాని ఆరోగ్యము, ఇప్పటికిన్నీ, బాబర్ హుమాయూన్ కాలంలోవలెనే.




అమూల్యమైయున్నది. అయితే మురికి ఆరోగ్యానికి ఎడతెగని ప్రమాదం. మనము మురికికాకుండా తప్పించుకోలేము. మురికిలో వ్యాధిని గలిగించే క్రిములున్నాయి. లైఫ్‌బాయ్ సబ్బు ఈ క్రిములను కడిగివేసి మీ ఆరోగ్యమును కాపాడును. రోజల్లా హాయిగా నుండుటకు ఎల్లప్పుడూ లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానం చేయండి.

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి ఉత్పత్తి.

L. 279-50 TL

# ఇంటింటికీ గ్రంథాలయం



## ఉత్తమ గ్రంథాలు : అతి స్వల్ప వెలలు

మా చందమామ పాఠకులకు,

మీకుటుంబమంతా వినోదంగా చందమామ చదువుతున్నారంటే, ఎన్నోతరాల విజ్ఞానాన్ని సంపాదిస్తున్నారన్నమాట. ఇది చక్కటి అలవాటు. మీరు చదవవలసిన మరికొన్ని మంచిమంచి పుస్తకాలు 'ఇంటింటికి గ్రంథాలయం' ప్రకటిస్తూంది చూడండి!—



దక్షిణభాషా పుస్తకసంస్థ సహకారమున ఎంతోమంది ప్రసిద్ధ ప్రచురణకర్తలు ఎన్నెన్నో మంచిమంచి పుస్తకాలు ప్రకటించియున్నారు. ఇంతవరకు వెలువడినవి........




(ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖవారు ఆమోదించినవి)

ఇవి అన్నీ తెనుగుదేశమంతటా అన్ని పుస్తకశాలలలోను విక్రయించే ఏర్పాట్లు జరిగినాయి. మీకు దగ్గరలో పుస్తకవిక్రేత లేకున్నా, ఏ కారణంవల్లనైనా మీకు ఈ గ్రంథాలు దొరక్కపోయినా, సరాసరి మాకు వ్రాయండి.

## ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్

6549/4, రాష్ట్రపతి రోడ్డు — సికింద్రాబాద్.

---

గమనిక:—పై పుస్తకాల సెట్టు రు. 15.75 న.పై. ఒకేసారి ఆర్డరిస్తే, ఖర్చులన్నీ మేమే భరించి మీ ఇంటికి అందజేస్తాం. విడికాపీ ఆర్డర్లకు పోస్టేజి అదనం.

ఆగష్టు విడుదల.....





శ్రీ ప్రొడక్షన్సు వారి

# మంచిమనసుకు మంచిరోజులు

దర్శకుడు. సి.యస్.రావు

నిర్మాతలు. సుందరలాల్ నహాటా
టి. అశ్వద్ధనారాయణ

రాజశ్రీ
విడుదల

BARTHA

Photo by Sundaramurty



బహుమతి
పొందిన వ్యాఖ్య

మా కయిష్టము

పంపినవారు :
బి. మల్లణ్ణ - సందవరం

